శ్రీ ర స్తు.

శృంగారరసప్రధానంబగు

# భరతరసప్రకరణము

## సాంధ్రతాత్పర్యము

శ్రీమాన్ నీడామంగలం తిరువేంకటాచార్యులవారిచేత

సమకూర్పఁబడినది.







చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1932

0-12-0

# పీఠిక.

అభినయశాస్త్రమందు దీనికి గావలసినహస్తములు మొదలయినవి చెప్పఁబడియున్నవి. వానినభినయమునఁ జూపునపుడు భావములను తదనుగుణముగాఁ జూపవలయును కాఁబట్టి అభినయించువారికిని దానిజూచియానందించువారికిని భావజ్ఞానమావశ్యము కావున శృంగారఅలంకారశాస్త్రములనేకముల శోధించి వానియందుముఖ్యములయిన సాహిత్యచింతామణి, ప్రతాపరుద్రీయము, రసార్ణవసుధాకరము మొదలయిన గ్రంథములనుండి ముఖ్యమైనవిషయముల నెత్తికూర్చి వానికి తెలుఁగున అర్థమువ్రాసి భరతరసప్రకరణంబను పేర ఈగ్రంథమును బ్రచురించితిమి. శృంగారరసము దానిభావములు మొదలగు వానిని విచారించువారికిని, భరతవిద్యను విచారించువారికిని యిదిమిక్కిలి యుపయుక్తము. అభినయవిషయములను దెలుపు అభినయదర్పణమను గ్రంథము పూర్వమే ముద్రింపఁబడియున్నది. ఈగ్రంథమునను యితరఅలంకారగ్రంథములయందుండు నాయికానాయకరసవ్యభిచారిభావాలంకారసహితములగు కొన్నిపదములు రాజమన్నారుగుడిలోనుండు భరతవిద్యాప్రవీణులగు శ్రీసభాపతయ్యగారిచే రచింపఁబడినవి ముద్రింపఁబడియున్నవి.

# విషయసూచిక.



శ్రీ ర స్తు.

# భరతరసప్రకరణము

## సాంధ్ర తాత్పర్యము.

---

శృంగారరససందోహం శ్రితకల్పమహీరుహం,
శ్రయే శ్రీనాథమేవాహం శ్రాంతలోకసుఖావహం. 1

శృంగారవ్యాపారములకూటమియును, స్వాశ్రితజనులకోరిక లీడేర్చు కల్పకవృక్షమును, సంసారాదితాపత్రయశ్రాంతులగు జనులకు శాశ్వత బ్రహ్మానంద మొసఁగువాఁడునగు లక్ష్మీవల్లభుని నామనోరథసంపూర్తికొరకు నాశ్రయించెదను.

కంఠేనాలంబయేద్గీతం హస్తేనార్థం ప్రదర్శయేత్,
చక్షుర్భ్యాం దర్శయేద్భావం పాదాభ్యాం తాళమాచరేత్.

నటనముఁ జేయునట్టి స్త్రీ మొదట గానముచేసి యావల గీతార్థమును హస్తాభినయములచేఁ దెలుపవలయును. నేత్రములచే భావమును దెలుపవలయును. పాదములచేఁ దాళము నాచరించవలయును.

యతో హస్తస్తతో దృష్టిర్యతో దృష్టిస్తతో మనః,
యతో మనస్తతో భావో యతో భావస్తతో రసః. 3

ఎచ్చట హస్తము చూపఁబడుచున్నదో అచ్చట దృష్టినుంచవలయును. దృష్టియుండెడుచోట మనసు నుంచవలయును. మనసుండెడుచోట భావ ముంచవలయును. ఎచ్చట భావమున్నదో అచ్చట రసము గలుగుచున్నది.

సూ. విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిరితి భరతసూత్రం.

విభావ అనుభావ వ్యభిచారిభావముల చేరికవలన రసము గలుగుచున్నదని భరతసూత్రము.

విభావో నామ.

రత్యాదిస్థాయినో యేన భావ్యంతే నితరామితి,
అతోఽసౌ భావపారజ్ఞైర్విభావ ఇతి కథ్యతే. 4

రతి మొదలగు స్థాయిభావములు దేనిచే మిక్కిలి భావింపఁబడుచున్నవో అవి భావజ్ఞులచే విభావమని చెప్పఁబడుచున్నది.

అనుభావో నామ.

రత్యాదిస్థాయినస్సమ్యక్చింతాదీంశ్చ తతః పరం,
అనుభావయతీత్యేష త్వనుభావ ఇతీర్యతే. 5

ఏది రతిమొదలగుస్థాయిభావములను, చింతమొదలగు వ్యభిచారిభావములను స్ఫురణమునకుఁ దెచ్చుచున్నదో యది యనుభావమని చెప్పఁబడును.

వ్యభిచారిభావో నామ.

విశేషేణాభిముఖ్యేన సంయాతి స్థాయినం ప్రతి,
వ్యభిచారీతి విజ్ఞేయో భావో భావార్థకోవిదైః. 6

ఏభావము రత్యాదిస్థాయిభావముల కెదురుగా సంచరించుచున్నదో అది వ్యభిచారిభావమని భావార్థజ్ఞులచే నెఱుంగఁదగినది.

విభావాదిభావానాం స్థాయినాం చ సంయోగో యథా.

కార్యకారణతాయోగః విభావస్థాయినో ర్మిథః,

స్థాయియైనది విభావములచే పుట్టింపఁబడునదిగనుక స్థాయివిభావముల కొకటొకటికి కార్యకారణభావము సంబంధమని చెప్పఁబడుచున్నది.

స్థాయ్యనుభావసంబంధో యథా.

జ్ఞాప్యజ్ఞాపకసంయోగ స్తథా స్థాయ్యనుభావయోః. 7

స్థాయి అనుభావములచే జ్ఞాపింపఁబడుచున్నదిగనుక స్థాయ్యనుభావములకు జ్ఞాప్యజ్ఞాపకభావము సంబంధమని చెప్పఁబడుచున్నది.

స్థాయివ్యభిచారిసంబంధో యథా.

పోష్యపోషకసంయోగః స్థాయినాం వ్యభిచారిణాం,

స్థాయిభావములు వ్యభిచారిభావములచే పోషింపఁబడుచున్నదిగనుక స్థాయివ్యభిచారులకు పోష్యపోషకభావము సంబంధ మనఁబడుచున్నది.

అయం సూత్రస్థసంయోగశబ్దార్థః పరికీర్తితః, 8

ముందు చెప్పిన తెఱఁగు భేదములు సూత్రములో నుండెడు సంయోగశబ్దార్థములని చెప్పఁబడును.

రసో నామ.

విభావైరనుభావైశ్చ వ్యభిచారిభి రేవ చ,
ఆనీయమానస్స్వాదుత్వం స్థాయిభావో రసస్స్మృతః. 9

స్థాయి విభావానుభావవ్యభిచారిభావములచే మనోజ్ఞత్వమును పొందింపఁబడి రసమగుచున్నది.

నిష్పత్తిర్నామ.

కారోత్పత్తిర్విభావస్య కార్యజ్ఞప్తి స్తతఃపరం,
అనుభావస్య కార్యస్య సంపుష్టిర్వ్యభిచారిణః. 10
ఇతి సూత్రస్థనిష్పత్తిశబ్దార్థః పరికీర్తితః.

విభావమునకు కార్యమును గలుగఁజేయుటయును, అనుభావమునకు కార్యమును జ్ఞాపించుటయును, వ్యభిచారిభావమునకు కార్యమును పోషించుటయును, నిష్పత్తిశబ్దార్థమని చెప్పఁబడును.

## విభావో నిరూప్యతే.

ఆలంబనోద్దీపనాత్మా విభావో ద్వివిధో మతః. 11

విభావము ఆలంబనవిభావమనియును, ఉద్దీపనవిభావమనియును, ఇరు దెఱఁగులుగఁ జెప్పఁబడినది.

## ఆలంబనవిభావో యథా.

యానాలంబ్య ప్రజాయంతే రత్యాదిస్థాయినోఽపి చ,
ఆలంబనాఖ్యాస్తే ప్రోక్తా నాయికాద్యా విచక్షణైః. 12

ఏవస్తువుల నాశ్రయించి రతి మొదలగు స్థాయిభావములును రసములును గలుగుచున్నవో నాయిక మొదలగు ఆవస్తువులు ఆలంబనములని భావశాస్త్రప్రవీణులచేఁ జెప్పఁబడెను.

## స్థాయిరసాలంబనభూతా నాయికా యథా.

రసాలంబనభూతా యా నాయికాత్ర నిరూప్యతే,
సా స్వీయా పరకీయేతి సామాన్యేతి త్రిధా మతా. 13

ఏనాయిక రసమునకు నాధారముగఁ జెప్పఁబడుచున్నదో ఆనాయిక స్వీయ, పరకీయ, సామాన్య అని మూఁడువిధముల నుండును.

## స్వీయా లక్షణం.

సంపత్కాలే విపత్కాలే యా న ముంచతి వల్లభం,
శీలార్జవగుణోపేతా సా స్వీయా పరికీర్తితా. 14
ముగ్ధా మధ్యా ప్రగల్భేతి త్రేధా సా తు నిగద్యతే,

సంపత్కాలమందును, విపత్కాలమందును, శీలము, ఆర్జవము మొదలగుసద్గుణములుగలిగి నాయకుని విడువక యున్నట్టిస్త్రీ స్వీయయని చెప్పఁబడును. అది ముగ్ధ యనియును, మధ్య యనియును, ప్రగల్భ యనియును మూఁడు విధములుగలది.

### ముగ్ధాలక్షణం.

ముగ్ధా నవవధూః కామరతౌ వామా మృదుః క్రుధి. 15
యతతే రతిచేష్టాసు గాఢలజ్జా మనోహరా,
కృతాపరాధే దయితే వీక్షతే రుదతీ సతీ. 16
అప్రియం వా ప్రియం వాపి న కించిదపి భాషతే,

ఏయువిద మన్మథవిహారమందు నూతనస్త్రీగాను, మన్మథక్రీడయందు అస్వాధీనురాలుగాను, గాఢమైన లజ్జగలదిగాను, కోపకాలమందు స్తిమితగాను, నాయకుఁ డపరాధియయినను రోదనముచేయుచు చూచుచుండునదిగాను, రతివ్యాపారము యత్నముఁజేయుచు హితాహితములను జెప్పకయుండునో యది ముగ్ధనాయిక.

### మధ్యానాయికాలక్షణం.

సమానలజ్జామదనా ప్రోద్యత్తారుణ్యశాలినీ. 17
మధ్యా కామయతే కాంతం మోహాంతే సురతక్షమా,
మధ్యా త్రిధా మానవృత్త్యా ధీరాధీరోభయాత్మికా. 18

సమానములైన సిగ్గును కామమును గలదియును, వృద్ధిబొందు యౌవనము గలదియును, మోహవ్యాపారమధ్యమందు సురతయోగ్యత గలదియునగుచు నాయకుని అపేక్షించునాయిక మధ్య యనఁబడును. ఆమధ్యనాయిక మానమనెడు కోపవ్యాపారముచే ధీర-అధీర-ధీరాధీర అని ముత్తెఱంగులు గలది.

### మానలక్షణం.

ప్రియాపరాధావగమాత్సంజాతో మాన ఇష్యతే,
లఘుమానో మధ్యమానో గురుమాన ఇతి త్రిధా. 19

నాయకాపరాధము దెలిసినపిదపఁ గలుగు మనోవ్యాపారవిశేషము

మానమని చెప్పఁబడును. ఆమానము లఘుమానమనియును, మధ్యమానమని యును, గురుమానమనియును, మూఁడు తెఱఁగులు గలిగియుండును.

## లఘుమానలక్షణం.

అన్యస్త్రీదర్శనాదిభ్యో లఘుమానః ప్రజాయతే,
వాగాద్యైరసౌ మానస్త్వపనేయః ప్రకీర్తితః. 20

అన్యస్త్రీదర్శనము మొదలైనవానివలన గలుగుకోపము లఘుమాన మనఁబడును. ఇది మంచిమాటలు మొదలయినవానిచే తొలఁగింపఁబడును.

## మధ్యమానలక్షణం.

మధ్యమానస్త్వథాన్యస్యా నామగ్రహణతో భవేత్,
ఏష మానోఽపనేతవ్యశ్శపథాద్యనువర్తనైః. 21

నాయకునితోడి సరససల్లాపకాలమందు అన్యస్త్రీపేరు చెప్పుటవలన గలుగు మనోవ్యాపారము మధ్యమాన మనఁబడును. ఈమానము ప్రమాణము చేయుట మొదలగుఅనుసరణములచేత తొలఁగింపఁబడును.

## గురుమానలక్షణం.

అన్యాసంగమచిహ్నైర్గురుమానః ప్రజాయతే,
పాదప్రణామానునయైరపనేయో భవేదసౌ. 22

అన్యస్త్రీసంభోగపుగుఱుతులు మొదలైనవానివలన గలుగు చిత్తావేగము గురుమానమనఁబడును. ఈమానము నమస్కరించుట అనునయించుట మొదలైనవానిచే తొలఁగింపఁబడును.

## మధ్యాధీరాలక్షణం.

ధీరా తు వక్తి వక్రోక్త్యా సోత్ప్రాసం సాగసం ప్రియం,

అపరాధియైయుండు నాయకునిజూచి సాభిప్రాయమైన వంకరమాటలాడునది మధ్యాధీరానాయిక యని చెప్పఁబడును.

మధ్యాఅధీరానాయికాలక్షణం.

అధీరా పరుషైర్వాక్యైః ఖేదయేద్వల్లభం రుషా. 23

అపరాధియగు నాయకుని క్రూరమైనపలుకులచే ఖేదపఱుచునది మధ్యాధీరానాయిక యనఁబడును.

మధ్యాధీరాధీరానాయికాలక్షణం.

ధీరాధీరా తు వక్రోక్త్యా సబాష్పం వదతి ప్రియం,

కన్నీరొలుక నాయకుని క్రూరపుఁబలుకులు పలుకునాయిక మధ్యాధీరాధీరానాయిక యనఁబడును.

ప్రగల్భానాయికాలక్షణం.

సంపూర్ణయౌవనోన్మత్తా ప్రగల్భారూఢమన్మథా. 24
దయితాంగకలీనేవ యతతే రతికేళిషు,

రతిప్రారంభమాత్రేణ గచ్ఛత్యానందమూర్ఛనాం. 25
మానవృత్త్యా ప్రగల్భాపి త్రేధా ధీరాదిభేదతః,

నిండుయౌవనముచే మదించినదిగాను, మన్మథవ్యాపారపారంగతురాలుగాను, ఉండునది ప్రగల్భానాయిక యనఁబడును. అది రతిలీలయందు నాయకాంగలీనవలె ప్రయత్నపడుచున్నది. క్రీడారంభములోనే ఆనందమూర్ఛను బొందును. ఆప్రగల్భానాయిక మానవ్యాపారముచే ముత్తెఱంగులైన ధీరాదిభేదములను బొందును.

ప్రగల్భాధీరా యథా.

ఉదాస్తే సురతేధీరా సావహిత్థా చ సాదరం. 26

కపటమానసయై అపరాధియగు నాయకునియందు ప్రేమతో రతివిషయములలో ఉపేక్షచేయునది ప్రగల్భాధీర యనఁబడును.

### ప్రగల్భా అధీరా యథా.

సంతర్జయత్యరం రోషాదధీరా తాడయేత్ప్రియం,

అపరాధియగు నాయకుని మిక్కిలి బెదరించికొట్టునది ప్రగల్భాధీరా నాయిక యనఁబడును.

### ప్రగల్భాధీరాధీరానాయికా యథా.

ధీరాధీరగుణోపేతా ధీరాధీరేతి కథ్యతే. 27
ఏతే జ్యేష్ఠా కనిష్ఠేతి భేదతో ద్వివిధే మతే,

అపరాధియగు నాయకునియందు రతివ్యాపారములో ఉపేక్షయు, బెదిరింపు, తిట్లు, కొట్లునుంగలది, ప్రగల్భాధీరాధీరానాయిక యని చెప్పఁబడును. ముందుచెప్పిన మధ్యాప్రగల్భలలోఁగల భేదమునొందిననాయికలు జ్యేష్ఠ కనిష్ఠ అనుభేదమువలన ఇరుదెఱంగు లగుదురు.

### జ్యేష్ఠాకనిష్ఠాలక్షణం.

ప్రియాధిక ప్రేమపాత్రం జ్యేష్ఠా సా తు నిగద్యతే. 28
న్యూనవిస్రంభపాత్రం చేత్కనిష్ఠా సా ప్రకీర్తితా,
మధ్యాప్రౌఢే ద్వాదశధా ముగ్ధా త్వేకవిధా మతా. 29
ఏవం త్రయోదశవిధా స్వీయా సా పరికీర్తితా.

నాయకునికి ఎవతెయందు ప్రేమ అధికముగా నుండునో ఆమె జ్యేష్ఠ యనఁబడును. తక్కువప్రేమ ఎవతెయందుండునో ఆమె కనిష్ఠ యనఁబడును. మధ్యాప్రగల్భానాయికలు పండ్రెండువిధములు గలవారనియు, ముగ్ధ ఏకవిధముగలదనియుఁ జెప్పఁబడుచున్నది. ఈచెప్పినప్రకారము మొదటఁజెప్పఁబడిన స్వీయ పదమూఁడువిధము లగుచున్నది.

### పరకీయాలక్షణం.

పరానురాగవ్యాపారగోపనే దత్తమానసా. 30

పరకీయేతి సా ప్రోక్తా భరతాగమవేదిభిః,
సా చ కన్యాపరోఢేతి ద్వివిధా పరికీర్తితా. 31

పరపురుషునియందుఁగల ఇచ్ఛావ్యాపారములను మఱుఁగుపఱుచుట యందు దత్తచిత్తురాలై యున్న నాయిక పరకీయ యనఁబడును. అది కన్య యనియు, పరోఢ యనియు, ఇరుదెఱంగులు గలిగియుండును.

—◎ పరకీయాకన్యాలక్షణం. ◎—

కన్యా త్వనూఢా యువతిస్సలజ్జా పితృపాలితా,
సఖీకేళిషు విస్రబ్ధా ప్రియే ముగ్ధగుణాన్వితా. 32

చతురయుగాను, యౌవనమధ్యస్థయుగాను, సిగ్గుగలదిగాను, తల్లిదండ్రులచే పోషితగాను, చెలులతోడి విహారములయందు ప్రియురాలుగాను, ప్రియునియందు ముగ్ధగుణముగలదిగాను నుండునది పరకీయకన్య.

—◎ పరకీయాపరోఢాలక్షణం. ◎—

పరోఢా తు ప్రియేణోఢాప్యన్యసంగమలాలసా,
నిపుణా గృహకృత్యేషు భర్తృచిత్తానువర్తినీ. 33

ప్రియునిచే పెండ్లియాడఁబడనదిగాను, పెనిమిటిమనస్సునకు సరియైననడతలుగలదిగాను, గృహకృత్యములందు సమర్థురాలుగాను, ఉండియును పరపురుషసంగమమం దాసక్తిగలదిగా నుండునది పరోఢ యనఁబడును.

—◎ సామాన్యానాయికాలక్షణం. ◎—

సామాన్యా సైవ గణికా కలాప్రాగల్భ్యధార్ష్ట్యయుక్,
విత్తమాత్రాశయా లోకే పురుషేష్వనురాగిణీ. 34
ఏతస్యా నానురాగస్స్యాద్గుణవత్యపి నాయకే,
భగ్నకామాన్నృతార్థజ్ఞాన్ బాలపాషండషండకాన్. 35

రక్తైవ రంజయేన్నిత్యం నిస్వాన్నాశు వివాసయేత్,
తస్యా దౌత్యప్రభృతయో గుణా స్తదుపయోగినః. 36

సంగీతాభినయాద్యనేకవిద్యాప్రాగల్భ్యధైర్యములు గలదిగాను, జనుల యందు ధనాశచేతనే అనురాగముగలదిగాను నుండునది సామాన్య; ఇదే గణిక. ఈనాయికకు నాయకుఁడు గుణవంతుఁడైనను ధనాగమములేకున్నవాని యందు ప్రేమ గలుగదు. ధనాగమముగలవారు భగ్నకాములైనను, బాలురై నను, పాషండులైనను, షండులైనను, వారలయందు ప్రేమగలదానివలెనే వారిని సంతోషపఱుచును. ఈచెప్పఁబడినవారు కపటమెఱుగనివారుగాను నుండవలయును. ధనములేనివానిని తఱుమఁగొట్టును. దానికి దౌత్యము మొద లైనగుణములు సహాయములని చెప్పఁబడుచున్నవి.

ఏతాష్షోడశనాయక్యో హ్యవస్థాభేదతః క్రమాత్,
ప్రత్యేకమష్టధా ప్రోక్తా భావశాస్త్రవిచక్షణైః. 37

ఈపదునాఱునాయికలకును శృంగారావస్థాభేదములచే ఒక్కొక తెకు నెనిమిది విధములుగ భేదములు చెప్పఁబడినవి.

## అష్టవిధనాయికా నిరూప్యంతే.

స్వాధీనపతికా చైవ తథా వాసకసజ్జికా
విరహోత్కంఠితా ప్రోక్తా విప్రలబ్ధా చ ఖండితా. 38
కలహాంతరితా చైవ తథా ప్రోషితభర్తృకా,
తథాభిసారికా చైవమష్టధా నాయికా మతాః. 39

స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక అని పూర్వము చెప్పఁబడినానాయి కలు ఒక్కొకతె దశాభేదముచేత నెనిమిదివిధములఁ జెప్పఁబడును.

స్వాధీనపతికానాయికాలక్షణం.

ప్రియోపలాలితా నిత్యం స్వాధీనపతికా మతా,
అస్యాస్తు చేష్టాః కథితాః స్మరపూజోత్సవాదయః. 40
వనకేళీజలక్రీడాకుసుమాపచయాదయః,

నాయకునిచే నెల్లప్పుడు సంతోషపఱుపఁబడెడిది స్వాధీనపతిక. దీనివ్యాపారము మన్మథపూజామహోత్సవము మొదలయినవియు, వనవిహారము, జలక్రీడ, పుష్పాపచయము, మొదలయినవియును.

వాసకసజ్జికానాయికాలక్షణం.

ప్రియాగమనవేళాయాం మండయంతీ ముహుర్ముహుః 41
కేళిగృహం తథాత్మానం సా స్యాద్వాసకసజ్జికా,
అస్యాస్తు చేష్టాస్సంపర్కమనోరథవిచింతనం. 42
సఖీవినోదో నితరాం ముహుర్దూతీనిరీక్షణం,
ప్రియాగమనమార్గాభివీక్షా ప్రభృతయో మతాః. 43

ప్రియుఁడువచ్చెడి సమయమందు తానలంకరించుకొని కేళీగృహము నలంకరించి సిద్ధముగా నుండునది వాసకసజ్జికానాయిక. దీనివ్యాపారములు నాయకునిసంసర్గమనోభీష్టమును యోచించుట, సఖులతోడి వినోదముసల్పుట, అడుగడుగునకు దూతికను సాభిప్రాయముగఁజూచుట, నాయకుఁడువచ్చెడి దారిని జూచుట మొదలైనవి.

విరహోత్కంఠితానాయికాలక్షణం.

అనాగసి ప్రియతమే చిరయత్యుత్సుకా తు యా,
విరహోత్కంఠితా భావవేదిభిః పరికీర్తితా. 44
అస్యాస్తు చేష్టాస్సంతాపో వేపథుశ్చాంగసాదనం,
అరతిర్బాష్పమోక్షశ్చ స్వావస్థాకథనాదయః. 45

నిరపరాధియగు ప్రియుఁడు రాక జాగుచేయఁగా కాలవిలంబమునోర్వక యెదురుచూచుచుండునాయిక విరహోత్కంఠిత యనఁబడును. దీనివ్యాపార

ములు సంతాపము, దేహము వణకు, చిన్నబోవుట, వ్యాపారాంతరములయందు ప్రీతిలేకయుండుట, కన్నీరువిడుచుట, తనయవస్థను సఖులకుఁ దెలుపుట మొదలైనవి.

## విప్రలబ్ధానాయికాలక్షణం.

క్వచిత్సంకేతమావేద్య తత్ర నాథేన వంచితా,
స్మరార్తా విప్రలబ్ధేతి కథితా భావకోవిదైః. 46
అస్యాస్తు చేష్టా నిర్వేదశ్చింతా ఖేదోఽథ దీనతా,
అశ్రునిశ్వాసమూర్ఛాద్యాః కథితా భావవేదిభిః. 47

ఒకానొకచోటిని సంకేతస్థానముగాఁ జెప్పి అక్కడ నాయకునిచే వంచింపఁబడి అనఁగా అతఁడక్కడికి రాకపోఁగా మన్మథపీడితురాలై యుండునది విప్రలబ్ధ యనఁబడును. దీనివ్యాపారములు నిర్వేదము, చింత, ఖేదము దీనత, కన్నీరును విడుచుట, నిట్టూర్పులువిడుచుట, మూర్ఛఁజెందుట మొదలైనవి.

## ఖండితానాయికాలక్షణం.

ఉల్లంఘ్య సమయం యస్యాః ప్రేయానన్యోపభోగవాన్,
భోగలక్ష్మాంకితః ప్రాతరాగచ్ఛేత్సా హి ఖండితా. 48
అస్యాస్తు చేష్టా నిశ్వాసస్తూష్ణీంభావోఽశ్రుమోచనం,
ఖేదభ్రాంత్యస్ఫుటాలాపా ఇత్యాద్యా విక్రియా మతాః. 49

సంకేతసమయమును నతిక్రమించి అన్యోపభోగపుగుఱుతులతో ప్రాతఃకాలమందు వచ్చెడినాయకునిగలది ఖండితానాయిక యనఁబడును. దీని వ్యాపారములు నిట్టూర్పువిడుచుట, పలుకకుండుట, కన్నీరువిడుచుట, ఖేదపడుట, భ్రమించుట, మూలుగుట మొదలయినవి.

### కలహాంతరితాలక్షణం.

యా సఖీనాం పురః పాదపతితం వల్లభం రుషా,
నిరస్య పశ్చాత్తపతి కలహాంతరితా తు సా. 50
అస్యాస్తు చేష్టా నిశ్వాసభ్రాంతిహృత్తాపసాధ్వసే,
ముహుః ప్రలాప ఇత్యాద్యాశ్చేష్టాః ప్రోక్తా మనీషిభిః. 51

సఖులయెదుట చరణపతితుఁడగునాయకుని నిరాకరించి పిదప పరితాప పడునది కలహాంతరిత యనఁబడును. దీనివ్యాపారములు నిట్టూర్పువిడుచుట, భ్రమించుట, మనస్తాపపడుట, స్తంభాదిసాధ్వసభావములుగలుగుట, మాటిమాటికి ప్రలపించుట మొదలైనవి.

### ప్రోషితభర్తృకాలక్షణం.

దేశాంతరగతే కాంతే ఖిన్నా ప్రోషితభర్తృకా,
అస్యాస్తు జాగరః కార్శ్యం నిమిత్తాద్యవలోకనం. 52
మాలిన్యమనవస్థానం ప్రాయశ్శయ్యానిషేవణం,
జాడ్యచింతా ప్రభృతయో విక్రియాః కథితా బుధైః. 53

నాయకుఁడు దేశాంతరమును జెందియున్నప్పుడు ఖేదపడుచుండునది ప్రోషితభర్తృక. దీనివ్యాపారములు నిదురలేకయుండుట, కృశించుట, ప్రియుఁడెన్నాళ్లకు వచ్చునని శకునములుచూచుట, మలినయైయుండుట, నిలిచినచోట నిలువకపోవుట, ఎప్పుడును పండుకొనియుండుట, ఏమియుఁ దోఁపకయుండుట, చింత మొదలైనవి.

### అభిసారికానాయికాలక్షణం.

మదనానలసంతప్తా యాభిసారయతి ప్రియం,
స్వయం వాభిసరేద్యా తు సా భవేదభిసారికా. 54
అస్యాస్సంతాపచింతాద్యా విక్రియాస్స్యుర్యథోచితం,

మదనానలసంతప్తయై తనస్థలమునకు నాయకుని వచ్చునట్టుచేయుఁ

చున్నదిగాని, తానే నాయకునిస్థలమునకుఁ బోవుచున్నదిగాని, అభిసారిక యనఁబడును. దీనివ్యాపారములు సంతాపపడుట, చింత మొదలైనవి, యాయా సమయోచితముగ నుండును.

ఏతాసాం నాయికానాం తు త్రైవిధ్యం పరికీర్తితం,
ఉత్తమా మధ్యమా చాథాప్యధమేతి ప్రభేదతః. 55

ముందుచెప్పిన ౧౨౮ భేదములుగలనాయికలు, ఉత్తమ, మధ్యమ, అధమ యను భేదములచేత మూఁడువిధములు గలవారగుదురు.

## ఉత్తమాలక్షణం.

విదధత్యప్రియం పత్యౌ ప్రియమాచరతి స్వయం,
వల్లభే సాపరాధే ఽపి తూష్ణీం తిష్ఠతి సోత్తమా. 56

నాయకుఁడు అహితముఁ జేయుచుండఁగ నతనికి ప్రియముగా నేపె నడచుచున్నదో, అపరాధియగు వల్లభుని చూచి యేపె యూరకయున్నదో, ఆపె ఉత్తమనాయిక.

## మధ్యమనాయికా లక్షణం.

పుంసి స్వయం కామయతి కామయేద్వా చ తం వధూః,
సక్రోధే క్రుధ్యతి ముహుః సూనృతే సత్యవాదినీ. 57
సాపరాధేఽపకర్త్రీ స్యాత్ స్నిగ్ధే స్నిహ్యతి వల్లభే,
ఏవమాదిగుణోపేతా మధ్యమా సా ప్రకీర్తితా. 58

నాయకుఁడు ఇచ్ఛించిన తానిచ్ఛించుట, అతఁడు కోపించుకొనిన తాను కోపించుట, అతఁడు నిజముపలికిన తాను నిజముపలుకుట, అతఁ డపరాధముచేసిన తా నపరాధము సేయుట, అతఁడు స్నేహించిన తాను స్నేహించుట, ఈరీతిగుణములుగలది మధ్యమనాయిక యనఁబడును.

### అధమనాయికాలక్షణం.

కళస్మాత్కుప్యతి రుషం ప్రార్థితాపి న ముంచతి,
సురూపం వా విరూపం వా గుణవంతమథాగుణం. 59
స్థవిరం తరుణం వాపి యా వా కామయతే ధ్రుతం,
ఈర్ష్యాకోపవిషాదేషు నియతా,సాధమా మతా. 60

ఏనాయిక అకారణముగ కోపించుచున్నదో, ప్రార్థించినను కోపమును విడువదో, చక్కనివాఁడైనను, అరూపుఁడైనను గుణవంతుఁడైనను, అగుణవంతుఁడైనను, ముసలివాఁడైనను,తరుణుఁడైనను, ఎట్లున్నను నాయకుని నిచ్ఛించుచున్నదో ఈర్ష్య, కోపము, వ్యసనము వీనినిగలదిగ నున్నదో, యది యధమ నాయిక యనఁబడును.

### నాయికాసంఖ్యాప్రకరణం.

స్వీయా త్రయోదశవిధా ద్వివిధా చ పరాంగనా,
వేశ్యైకైవం షోడశధా తాశ్చావస్థాభిరష్టభిః. 61
ప్రత్యేకమష్టధా తాసాముత్తమాదిప్రభేదతః,
త్రైవిధ్యమేవం స చతురశీతిత్రిశతం భవేత్. 62

స్వీయ ౧౩ విధములు గలదియు, పరకీయ ౨ విధములు గలదియు, సామాన్య ౧ విధముగలదియు నగును. ఈ౧౬విధములుగలనాయికలకు ప్రత్యేకము ఎనిమిది యవస్థలుగలుగుటవలన నూటయిరువదిభేదములు గలవారగుదురు. వీరలు మరల ఉత్తమాదిభేదము వలన 3౮౪ భేదములు గలవారగుదురు.

### ఆసాం దూత్యాదయో నిరూప్యంతే.

దూతీ దాసీ సఖీ చేటీ ధాత్రేయీ ప్రాతివేశినీ,
లింగినీ శిల్పినీత్యాద్యాస్సహాయాః పరికీర్తితాః 63

ఈనాయికలకు సహాయపడువారు దూతి దాసి సఖి చేటి ధాత్రేయి ప్రాతివేశినీ లింగిని శిల్పిని వీరు మొదలయినవారు.

అథ శృంగారనాయకా నిరూప్యంతే.

పతిశ్చోపపతిశ్చైవ వైశికశ్చ తతఃపరం,
స్వీయాదీనాం నాయికానాం నాయకాః కథితా బుధైః. 64

పతి, ఉపపతి, వైశికుఁడు, అనువీరు-స్వీయా, పరకీయా, సామాన్యలకు నాయకులని చెప్పఁబడుదురు.

పతిలక్షణం.

వేదశాస్త్రానురోధేన పాణిం గృహ్ణాతి యః స్త్రియః,
స ఏవ పతిరిత్యుక్తః విద్వద్భిరిహ శాస్త్రతః. 65

ఏపురుషుఁడు వేదశాస్త్రోక్తముగ ఏస్త్రీని పాణిగ్రహణముచేసికొనుచున్నాఁడో ఆమెకు వాఁడే భర్తయని విద్వాంసులు శాస్త్రమందు చెప్పియున్నారు.

ఉపపతిలక్షణం.

ప్రలోభ్యాన్యవధూం భుఙ్క్తే ఉపాయైర్వివిధైరపి,
స తూపపతిరిత్యుక్తః విద్వద్భిరిహ శాస్త్రతః. 66

అన్యవనితను వివిధోపాయములచే నాసపఱచి అనుభవించునతఁడు ఉపపతి యనఁబడును.

వైశికలక్షణం.

వేశ్యాబహుళసంభోగసమాసాదితగౌరవః,
విత్తవ్యయీ విలాసీ చ వైశికః పరికీర్తితః. 67

ఎవఁడు వేశ్యోపభోగములచే పొందఁబడిన గౌరవముగలవాఁడును, అర్థవ్యయముచేయువాఁడును, విలాసముగలవాఁడు నైయుండునో వాఁడు వైశికుఁడని చెప్పఁబడును.

### చతుర్విధశృంగారనాయకలక్షణం.

ఏతే శృంగారవిషయాశ్చత్వారస్స్యుః పృథక్పృథక్,
అనుకూలో దక్షిణశ్చ ధృష్టశ్శఠ ఇతి స్మృతాః. 68

శృంగారవిషయులైన ఈనాయకులు అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు అని వేర్వేఱుగ నలుతెఱఁగు లగుదురు.

### అనుకూలనాయకలక్షణం.

ఏకాయత్తోఽనుకూలస్స్యాత్సదా తామనురంజయన్,
అన్యస్త్రీదర్శనాదిభ్యో నివృత్తనిజమానసః. 69

ఇతరస్త్రీలను జూచుట మొదలయిన వ్యాపారరహితుఁడును, స్వస్త్రీయందే ప్రేమగలవాఁడునై యుండువాఁడు అనుకూలుఁ డనఁబరగును.

### దక్షిణనాయకలక్షణం.

బహ్వీషు విద్యమానాసు స్వాశ్రితాసు నిరంతరం,
సమప్రీతిం ప్రకుర్వాణః స దక్షిణ ఇతి స్మృతః. 70

తన్నాశ్రయించిన అనేకస్త్రీలయందు సమముగ ప్రీతిఁజేయువాఁడు దక్షిణుఁ డనఁబరగును.

### ధృష్టనాయకలక్షణం.

వ్యక్తాగా రతభీర్ధృష్టః వారితోఽపి న ముంచతి,
తామేవానుసరత్యాశు ప్రణామానునయాదిభిః. 71

ఎవఁడు తనయపరాధము నాయికచే నెఱుఁగఁబడినను భయములేక యుండునో తొలఁగించినం దొలఁగఁడో ఆనాయికనే త్వరగా నమస్కారము మొదలయిన ఉపాయములచే అనుసరించునో వాఁడు ధృష్టుఁడనఁబరగును.

### శఠనాయకలక్షణం.

ప్రియాయామనురక్తాయాం గూఢవిప్రియకర్మకృత్,
అత శ్శఠ ఇతి ప్రోక్తః భావశాస్త్రవిచక్షణైః. 72

అనురాగముగల ప్రియకు గూఢముగ అహితముఁ జేయువాఁడు శఠుఁ డనఁబడును.

### ఏతేషాం సహాయా నిరూప్యంతే.

పీఠమర్దో విటశ్చేటః విదూషక ఇతి స్మృతాః,
చత్వారః కామతంత్రజ్ఞా ఏతేషాం సహకారిణః. 73

ముందుచెప్పినశృంగారనాయకులకు సహాయులగువారు పీఠమర్దుఁడనియు, విటుఁడనియు, చేటుఁడనియు, విదూషకుఁడనియు నలుదెఱంగు లగుదురు.

### పీఠమర్దాదిలక్షణం.

కించిదూనః పీఠమర్దః ఏకవిద్యో విటః స్మృతః,
సంధానచతురశ్చేటః హాస్యప్రాయో విదూషకః. 74

నాయకునికి కొంచెము తక్కువగా నుండువాఁడు పీఠమర్దుఁడు. కామశాస్త్రప్రవీణుఁడైయుండువాఁడు విటుఁడు. నాయికానాయకులకు సంధి చేయువాఁడు చేటుఁడు. హాస్యప్రధానుఁడై యుండువాఁడు విదూషకుఁడు.

### అథ ఉద్దీపనవిభావో నిరూప్యతే.

ఉద్దీపనశ్చతుర్ధా స్యాదాలంబనసమాశ్రితః,
గుణాశ్చేష్టాలంకృతయ స్తటస్థాశ్చేతి భేదతః. 75

ఆలంబనవిభావము నాశ్రయించియుండు గుణములు చేష్టలు అలంకృతులు ఇవి మూఁడును, తటస్థములును కూడ ఉద్దీపనవిభావము నలుదెఱఁగులఁ బరగును.

—— ఆలంబనగుణా యథా. ——

యౌవనం రూపలావణ్యసౌందర్యాణ్యభిరూపతా,
మార్దవం సౌకుమార్యం చేత్యాలంబనగతా గుణాః. 76

యౌవనము, రూపము, లావణ్యము, సౌందర్యము, అభిరూపత్వము, మార్దవము, సౌకుమార్యము, ఇవి ఆలంబనగుణములు.

—— యౌవనం నిరూప్యతే. ——

సర్వాసామపి నారీణాం యౌవనం త్రివిధం మతం,
ప్రతియౌవనమేతాసాం చేష్టితాని పృథక్పృథక్. 77

సమస్తస్త్రీలకును యౌవనము మూఁడుతెఱఁగులౌను. ఆయాయౌవనమున చేష్టలు వెవ్వేరుగ నుండును.

—— ప్రథమయౌవనలక్షణం. ——

ఈషచ్చపలనేత్రాంతం స్మరస్మేరముఖాంబుజం,
సగర్వజరజోగంధమసమగ్రారుణాధరం. 78
లావణ్యోద్భేదరమ్యాంగం విలసద్భావసౌరభం,
ఉన్మీలితాంకురకుచం అస్ఫుటాంగికసంధికం. 79
ప్రథమం యౌవనం తత్ర వర్తమానా మృగేక్షణా,
అపేక్షతే మృదుస్పర్శం సహతే నోచ్చతాం రతేః 80
సఖీకేళిరతా స్వాంగసంస్కారకలితాదరా,
న కోపహర్షౌ భజతే సపత్నీదర్శనాదిషు. 81
నాతిలజ్జావతీ కాంతసంభోగే కింతు శఙ్కతే,

కించిచ్చపలములైన కడకండ్లనుగలదిగాను, మన్మథునిచే వికాసము నొందిన ముఖపంకజముగలదిగాను, గర్వమువలనగలిగిన రజోగంధముతోఁ గూడినదిగాను, నిండుఎఱుపులేని పెదవులుగలదిగాను, లావణ్యముయొక్క

ప్రకాశమువలన మనోహరమైన దేహముగలదిగాను వెలయుచుండు భావ సౌరభము గలదిగాను, వృద్ధిబొందు మొలకచన్నులుగలదిగాను, చక్కగా నేర్పడనిఅంగములసంధులు గలదిగాను ఉండునది ప్రథమయౌవన మనఁబడును. ఈయౌవనముగలనాయిక మృదుస్పర్శము నపేక్షించును. ఉచ్చరతిని సహింపదు. సఖులతోనాడుటయందుప్రియము. తన్ను తానలంకరించుకొనుట యందుప్రియము. సవతినిజూచుట మొదలైనకార్యములందు కోపసంతోష ములులేనిదిగానుండుట, ప్రియునియందు అధికముసిగ్గులేకుండుట, రతియందు భయము ఈగుణములు గలిగి యుండును.

## ద్వితీయయౌవనలక్షణం.

స్తనౌ పీనౌ తనుర్మధ్యః పాదే పాణౌ చ రక్తిమా. 82
ఊరూ కరికరాకారౌ అంగం వ్యక్తాంగసంధికం,
నితంబో విపులో నాభిర్గంభీరా జఘనం ఘనం. 83
వ్యక్తరోమావళిస్స్నిగ్ధ్యమంగప్రత్యంగసౌష్ఠవం,
ద్వితీయం యౌవనం తత్ర వర్తమానా సులోచనా. 84
సఖీషు స్వాశయజ్ఞాసు స్నిగ్ధా ప్రాయేణ భామినీ,
న ప్రసీదత్యనునయైస్సపత్నీష్వభ్యసూయినీ. 85
నాపరాధాన్విషహతే ప్రణయేర్ష్యాకషాయితా,
రతికేళిష్వనిభృతా చేష్టతే గర్వితా రహః 86

గొప్ప చన్నులును, సన్నమైననడుమును, ఎఱుపుగలచేతులుకాళ్లును, ఏనుఁగుతొండమువంటి తొడలును, వ్యక్తాంగసంధియగు దేహమును, విపుల మైన నితంబమును, గంభీరమైననాభియు, ఘనమయిన జఘనప్రదేశమును, ప్ర కాశమైన రోమావళినిగనిగయును, అంగ ప్రత్యంగముల చక్కఁదనమును గలదై యుండునది ద్వితీయయౌవన మనఁబడును. ఈయౌవనముగలనాయిక తన మనోభావము తెలిసిన సఖులయందు తరుచుగా ప్రీతికలదిగాను, సమాధా

నపుమాటలచే తృప్తిపడనిదిగాను, సవతులయందు అసూయగలదిగాను, అప రాధములను ఓర్వనిదిగాను, ప్రణయకలహమందు ఈర్ష్యకలదిగాను, రతి కేళులయందు స్తిమితగాక ఏకాంతమందు గర్వించి వ్యాపరించునదిగాను నుండును.

## తృతీయయౌవనలక్షణం.

అస్నిగ్ధతా నయనయోర్గండయో ర్మ్లానకాంతితా,
విచ్ఛాయతా ఖరస్పర్శోఽప్యంగానాం శ్లథతా మనాక్. 87
అథ రే మసృణో రాగః తృతీయే యౌవనే భవేత్,
తత్ర స్త్రీణామియం చేష్టా రతితంత్రవిదగ్ధతా. 88
వల్లభస్యాపరిత్యాగః తదాకర్షణకౌశలం,
అనారోపోఽపరాధేషు సపత్నీష్వప్యమత్సరః. 89

నేత్రములయందు తేటమాఱినదియు, చెక్కిళ్లయందు వాడినదియు' దేహచ్ఛాయ తప్పినదిగాను, కఠినమైనస్పర్శముగలదిగాను, కొంచెము దేహ పటుత్వము తప్పినదిగాను, పెదవులయెఱుపుమీాఱినదిగాను ఉండునది తృతీయ యౌవన మనఁబడును. ఈయౌవనముగలనాయిక వ్యాపారములు, రతితంత్ర ములయందు విశేషచాతుర్యము, నాయకుని విడువకయుండుట, నాయకుని స్వాధీనపఱుచుకొను పాండిత్యము, నాయకాపరాధములయందు అసూయ లేకయుండుట, సవతులయందు మాత్సర్యము లేకయుండుట మొదలయినవి.

తత్ర శృంగారయోగ్యత్వం రసాహ్లాదనకారణం,
ఆద్యద్వితీయయోరేవ న తృతీయస్య వర్ణ్యతే. 90

ఈమూఁడువిధముల యౌవనములయందును మొదటిరెంను యౌవన ములకే రసములచే సంతోషపఱుచుటకు కారణమైన శృంగారయోగ్యత కలదు. మూఁడవయౌవనమునకు ఈయోగ్యత లేదు.

## రూపలక్షణం.

అంగాన్యభూషితాన్యేవ ప్రక్షేపాద్యైర్విభూషణైః,
యేన భూషితవద్భాతి తద్రూపమితి కథ్యతే. 91

అంగములు తగినభూషణములచే అలంకరింపఁబడకయే అలంకరింపఁబడినట్లు దేనిచేత శోభించునో యది రూపమనఁబడును.

## లావణ్యలక్షణం.

ముక్తాఫలేషు ఛాయాయా స్తరళత్వమివాంతరే,
ప్రతిభాతి యదంగేషు తల్లావణ్యమిహోచ్యతే. 92

ముత్యములయందుండు ఛాయయొక్క తరళత్వమువలెనే అవయవములయందు ఏకాంతిప్రకాశించుచున్నదో యది లావణ్యమని చెప్పఁబడును.

## సౌందర్యలక్షణం.

అంగప్రత్యంగకానాం యో సన్నివేశో యథోచితం,
సుస్నిగ్ధసంధిబంధస్స్యాత్తత్సౌందర్యమితీర్యతే. 93

అంగప్రత్యంగములయొక్క చక్కని సంధిబంధముగల యథోచిత సన్నివేశము సౌందర్య మనఁబడును.

## ఆభిరూప్యలక్షణం.

యదాత్మీయగుణోత్కర్షైర్వస్త్వన్యన్నికటస్థితం,
సారూప్యం నయతి ప్రాజ్ఞైరాభిరూప్యం తదుచ్యతే. 94

ఆత్మీయగుణాధిక్యమువలన తనసమీపముననుండు వస్తువునకు తనసారూప్యమును గలుగఁజేయునది యాభిరూప్య మనఁబడును.

## మార్దవలక్షణము.

స్పృష్టం యత్రాంగమస్పృష్టమివ స్యాన్మార్దవం హి తత్,

దేహము అంటఁబడియు అంటఁబడనిదానివలెనుండునది మార్దవ మనఁబడును.

## సౌకుమార్యలక్షణం.

యా స్పర్శాసహతాంగేషు కోమలస్యాపి వస్తునః. 95
తత్సౌకుమార్యం త్రేధా స్యాదుత్తమాదిప్రభేదతః,

అంగములయందు కోమలమైన వస్తువుయొక్కయైనను స్పర్శమును సహింపమి సౌకుమార్యము. ఆసౌకుమార్యము ఉత్తమ-మధ్యమ-అధమ-భేదములవలన ముత్తెఱఁగులౌను.

## ఉత్తమసౌకుమార్యలక్షణం.

అంగం పుష్పాదిసంస్పర్శాసహం యేన తదుత్తమం. 96

ఏగుణముచేత అంగము పుష్పాదులస్పర్శమునుగూడ నోర్వదో యది ఉత్తమసౌకుమార్యము.

## మధ్యమసౌకుమార్యలక్షణం.

న సహేత కరస్పర్శం యేనాంగం మధ్యమం హి తత్,

ఏగుణముచేత అంగము కరస్పర్శమునుసహింపదో యది మధ్యమసౌకుమార్యము.

## అధమ సౌకుమార్యలక్షణము.

యేనాంగమాతపాదీనామసహం తదిహాధమం. 97

ఏగుణముచేత దేహము ఎండమొదలయినవానిని సహింపదో యది అధమసౌకుమార్యము.

## చేష్టాయథా.

చేష్టాస్తు యౌవనోద్భూతకటాక్షాదయ ఈరితాః,

యౌవనవ్యాప్తిచేత గలుగు కడకంటిచూపులు మొదలైనవి చేష్టలు.

అలంకృతిర్యథా.

చతుర్థాలంకృతిర్వాసోభూషామాల్యానులేపనైః. 98

అలంకృతి, వస్త్రములు, భూషణములు, పుష్పములు, మైపూఁతలు ఈవిధములచే నలుదెఱఁగులౌను.

తటస్థాయథా.

తటస్థాశ్చంద్రికాధారగృహచంద్రోదయాదయః,
కోకిలాకులమాకందమందమారుతషట్పదాః. 99
లతామంటపభూగేహదీర్ఘికాజలదారవాః,
ప్రాసాదగర్భసంగతక్రీడాద్రిసరిదాదయః. 100
ఏవమూహ్యా యథాకాలముపభోగోపయోగినః,

చంద్రికాధారములైన గృహములు, చంద్రోదయము మొదలైనవి, కోవెలలునిండియుండురసాలవృక్షము, మందమారుతము, భ్రమరములు, పొదరిండ్లు, భూగేహము, దీర్ఘికలు, మేఘనాదము, ప్రాసాదమధ్యము, సంగీతము, క్రీడాదులు, సెలయేఱులు మొదలైనవి ఉపభోగోపయోగవస్తువులు తటస్థోద్దీపనములు - ఇవి కాలోచితములుగ నూహించుకోవలసినవి.

అథ అనుభావలక్షణం.

భావం మనోగతం సాక్షాత్స్వహేతుం వ్యంజయంతియే. 101
తేఽనుభావా ఇతి ఖ్యాతా భ్రూవిక్షేపస్మితాదయః,
తే చతుర్ధా చిత్తగాత్రవాగ్బుద్ధ్యారంభసంభవాః. 102

స్వహేతువైన మనోగతాభిప్రాయమును ప్రత్యక్షమువలెనే బయలుపఱచునవి యనుభావములు. ఇవి చిత్తజానుభావములు, గాత్రజానుభావ

ములు, వాగారంభానుభావములు, బుద్ధ్యారంభానుభావములు అని నలుదెఱఁగు లౌను.

—— చిత్తజానుభావా లక్ష్యంతే. ——

తత్ర చ భావో హావో హేలా శోభా చ కాంతిదీప్తీ చ,
ప్రాగల్భ్యం మాధుర్యం ధైర్యౌదార్యే చ చిత్తజా భావాః.

ఆనలుదెఱంగుల అనుభావములయందు భావము, హావము, హేల, శోభ, కాంతి, దీప్తి, ప్రాగల్భ్యము, మాధుర్యము, ధైర్యము, ఔదార్యము ఇవి చిత్తజానుభావము లనఁబడును.

—— భావలక్షణం. ——

నిర్వికారస్య చిత్తస్య భావస్స్యాదాద్యా తు విక్రియా,
గ్రీవా రేచకసంయుక్తో భ్రూనేత్రాదివిలాసకృత్. 104

వికారములేని మనసుయొక్క విక్రియ భావమనఁబడును. అది గ్రీవారేచకసంయుక్తమై భ్రూనేత్రాదులయందు వికాసముచు గలుగఁ జేయును.

—— హావలక్షణం. ——

భావఈషత్ప్రకాశో యః స హావ ఇతి కథ్యతే,

ఆభావము నేత్రాదులవలన నించుక ప్రకాశపడెనేని యది హావమనఁ బడును.

—— హేలాలక్షణం. ——

భావ ఏవ భవేద్ధేలా లలితాభినయాత్మకః. 105

ఆభావమే లలితాభినయరూపమగునప్పుడు హేల యనఁబడును.

—— శోభాలక్షణం. ——

సా శోభా రూపభూషాద్యైర్యత్స్యాదంగవిభూషణం,

రూపభూషాదులచే దేహము నలంకరించుకొనుట శోభ యనఁబడును.

## కాంతిలక్షణం.

శోభైవ కాంతిరాఖ్యాతా మన్మథాప్యాయనోజ్వలా. 106

ఆశోభయే మన్మథవిషయతృప్తిఁజేయుటయందు ప్రకాశించెనేనియది కాంతి యనఁబడును.

## దీప్తిలక్షణం.

కాంతిరేవ వయోభోగదేశకాలగుణాదిభిః,
ఉద్దీపితాతివిస్తారం యాతా చేద్దీప్తిరుచ్యతే. 107

ఆకాంతియే వయోభోగదేశకాలగుణాదులచే మిక్కిలి యధికమాయె నేని యది దీప్తియనఁబడును.

## ప్రాగల్భ్యలక్షణము.

నిశ్శంకత్వం ప్రయోగేషు ప్రాగల్భ్యం పరికీర్తితం,

ప్రయోగములయందు నిశ్శంకవృత్తి ప్రాగల్భ్యమనఁబడును.

## మాధుర్యలక్షణము.

మాధుర్యం నామ చేష్టానాం సర్వావస్థాసు మార్దవం. 108

సర్వావస్థలయందును వ్యాపారములయొక్క మృదుత్వమే మాధుర్యమనఁబడును.

## ధైర్యలక్షణము.

స్థిరా చిత్తోన్నతిర్యా తు తద్ధైర్యమితి సంజ్ఞితం,

దృఢమైనచిత్తవృత్తి ధైర్యమనఁబడును.

## ఔదార్యలక్షణము.

ఔదార్యం వినయం ప్రాహుః సర్వావస్థానుగం బుధాః. 109

సర్వావస్థలయందు ననుసరించినవినయమును ఔదార్యమని చెప్పుదురు.

అథ గాత్రజానుభావా నిరూప్యంతే.

లీలా విలాసో విచ్ఛిత్తిః విభ్రమః కిలికించితం,
మోట్టాయితం కుట్టమితం బిబ్బోకం లలితం తథా. 110
విహృతం చేతి విజ్ఞేయాః స్త్రీణాం తు దశ గాత్రజాః,

లీల, విలాసము, విచ్ఛిత్తి, విభ్రమము, కిలికించితము, మోట్టాయితము, కుట్టమితము, బిబ్బోకము, లలితము, విహృతము ఈపదియు స్త్రీల గాత్రజానుభావము లనఁబడును.

లీలాలక్షణం.

ప్రియానుసరణం యత్తు మధురాలాపపూర్వకైః. 111
చేష్టితైర్గతిభిశ్చాపి సా లీలేతి నిగద్యతే,

మధురాలాపము మొదలైనచేష్టలచే నాయకుని ననుసరించుట లీల యనఁబడును.

విలాసలక్షణం.

ప్రియసంప్రాప్తిసమయే భ్రూనేత్రాననకర్మభిః. 112
తాత్కాలికో విశేషో యః స విలాస ఇతీరితః,

నాయకుఁడు వచ్చెడిసమయమందు కనుబొమలు, కన్నులు, ముఖము వీనిచే నప్పుడుగలుగువిశేషమేదో యది విలాస మనఁబడును.

విచ్ఛిత్తిలక్షణం.

ఆకల్పకల్పనాకల్పా విచ్ఛిత్తిరతికాంతికృత్. 113

అలంకారవిన్యాసములకు సమానమై మెరయుచునుండునది విచ్ఛిత్తి యనఁబడును.

విభ్రమలక్షణం.

ప్రియాగమనవేళాయాం మదనావేశసంభ్రమాత్,
విభ్రమో గంధహారాదిభూషాస్థానవిపర్యయః. 114

ప్రియుఁడువచ్చెడి సమయమందు మన్మథావేశసంభ్రమముచే గంధము, హారము మొదలైన భూషణస్థానవిపర్యయము విభ్రమ మనఁబడును.

కిలికించితలక్షణం.

శోకరోషాశ్రుహర్షాదేస్సంకరః కిలికించితం,

శోకము, కోపము, కన్నీరు, సంతోషము వీనికూడిక కిలికించిత మనఁబడును.

మోట్టాయితలక్షణం.

స్వాభిలాషప్రకటనం మోట్టాయితమితీరితం. 115

తనకోరికను బయలుపఱచుట మోట్టాయిత మనఁబడును.

కుట్టమితలక్షణము.

కేశాధరాదిగ్రహణే మోదమానాపి మానసే,
దుఃఖితేవ బహిః కుప్యేద్యది కుట్టమితం భవేత్. 116

రతికాలమందు ఉవిద కొప్పు అధరము మొదలైన వానియొక్క గ్రహణమందు మనసులో సంతోషముగలదై యుండినను బయటికి దుఃఖితురాలువలెనే కోపించుట కుట్టమిత మనఁబడును.

బిబ్బోకలక్షణం.

ఇష్టేఽప్యనాదరో గర్వాత్ మనాక్ బిబ్బోక ఇష్యతే,

గర్వమువలన ప్రియవస్తువునందు కొంచెము అనాదరణము బిబ్బోక మనఁబడును.

### లలితలక్షణం.

విన్యాసభంగిరంగానాం భ్రూవిలాసమనోహరాః. 117
సుకుమారా భవేయుశ్చేత్ లలితం తదుదీరితం,

అంగవిన్యాసచమత్కారములు, మనోహరభ్రూవిలాసములు, సుకుమారములై యుండిన అది లలిత మనఁబడును.

### విహృతలక్షణం.

ఈర్ష్యయా మానలజ్జాభ్యామదత్తం యోగ్యముత్తరం 118
క్రియయా వ్యజ్యతే యత్ర విహృతం తదుదీరితం,

ఈర్ష్యచేతగాని, కోపముచేతగాని, సిగ్గుచేతగాని తగుపాటియుత్తర మియ్యక క్రియలచేఁ దెలుపఁబడెనేని అది విహృత మనఁబడును.

### వాగారంభానుభావా నిరూప్యంతే.

ఆలాపశ్చ విలాపశ్చ సల్లాపశ్చ ప్రలాపకః. 119
అనులాపోఽపలాపశ్చ సందేశశ్చాతిదేశకః,
నిర్దేశశ్చాపదేశశ్చ వ్యపదేశోపదేశకౌ. 120
ఏవం ద్వాదశధా ప్రోక్తా వాగారంభా విచక్షణైః,

ఆలాపము, విలాపము, సల్లాపము, ప్రలాపము, అనులాపము, అపలాపము, సందేశము, అతిదేశకము, నిర్దేశము, అపదేశము, వ్యపదేశము, ఉపదేశము, ఈపండ్రెండును వాగారంభానుభావము లనఁబడును.

### ఆలాపవిలాపలక్షణే

తత్రాలాపః ప్రియోక్తిస్స్యాద్విలాపో దుఃఖజం వచః. 121
అందు సంతోషపుమాట ఆలాపమౌను. దుఃఖముచేఁ గలుగుపలుకు విలాపమౌను.

## సల్లాపలక్షణం.

ఉక్తిప్రత్యుక్తిమద్వాక్యం సల్లాపః పరికీర్తితః

ఉక్తిప్రత్యుక్తిగలమాట సల్లాప మనఁబడును.

## ప్రలాపానులాపలక్షణే.

వ్యర్థాలాపః ప్రలాపస్స్యాదనులాపో ముహుర్వచః. 122

ఉపయోగములేనిమాట ప్రలాప మనఁబడును. చెప్పినమాటలనే చెప్పుట అనులాప మనఁబడును.

## అపలాపలక్షణం.

అపలాపస్తు పూర్వోక్తస్యాన్యథా యోజనం భవేత్,

మొదటచెప్పినమాటను వేఱువిధముగా త్రిప్పుట అపలాపనూను.

## సందేశలక్షణం.

సందేశస్తు ప్రోషితస్య స్వవార్తాప్రేషణం భవేత్. 123

ఊరికిపోయియుండు నాయకునికి తనసంగతులను సఖులముఖమునఁ దెలుపుట సందేశమనఁబడును.

## అతిదేశలక్షణం.

సోఽతిదేశో మదుక్తాని తదుక్తానీతి యద్వచః

నేనుచెప్పినమాటలే అతఁడుచెప్పిన మాటలనుట అతిదేశ మనఁబడును.

## నిర్దేశలక్షణం.

నిర్దేశస్తు భవేత్సోఽయమహమిత్యాదిభాషణం. 124

వాఁడు, వీఁడు, వాఁడు, నేను మొదలైనపలుకులు నిర్దేశమనఁబడును.

## అపదేశలణక్షం.

అన్యార్థకథనం యత్ర సోఽపదేశ ఇతీరితః,

అర్థాంతరమును దెలియపఱుచుపలుకు అపదేశ మనఁబడును.

**ఉపదేశలక్షణం.**

యచ్ఛిష్యార్థం తు వచనముపదేశస్స ఉచ్యతే. 125

శిష్యులకొఱకు ఆచార్యులచేఁ జెప్పఁబడుపలుకు ఉపదేశ మనఁబడును.

**వ్యపదేశలక్షణం.**

వ్యాజేనాత్మాభిలాషోక్తిర్యా సా స్యాద్వ్యపదేశకః,

ఇతరవ్యాజమున తనకోరికను దెలుపుట వ్యపదేశ మనఁబడును.

**అథ బుద్ధ్యారంభానుభావా నిరూప్యంతే.**

బుద్ధ్యారంభా స్తథా ప్రోక్తారీతివృత్తిప్రవృత్తయః. 126

ఈబుద్ధ్యారంభానుభావములు రీతియనియు, వృత్తియనియు, ప్రవృత్తియనియు ముత్తెఱంగులగును.

ప్రబంధాదిషు తే జ్ఞేయా భావశాస్త్రవిచక్షణైః,

ఇవి ప్రబంధము మొదలైనవానియందు భావశాస్త్రజ్ఞులచే నెఱుఁగఁదగినవి.

**అథ సాత్వికభావా నిరూప్యంతే.**

అన్యేషాం సుఖదుఃఖాదిభావేషు కృతభావనం. 127
ఆనుకూల్యేన యచ్చిత్తం భావకానాం ప్రవర్తతే,
తత్సత్వమితి విజ్ఞేయం ప్రాజ్ఞైస్సతోద్భవానిమా. 128

సాత్వికా ఇతి జానంతి భరతాద్యా మహర్షయః,
తే స్తంభస్వేదరోమాంచస్స్వరభేదశ్చ వేపథుః. 129
వైవర్ణ్యమశ్రుప్రళయ ఇత్యష్టౌ సాత్వికా మతాః,

ఇతరులయొక్క సుఖదుఃఖములు మొదలైన భావములయందు అనుకూల్యముతో కృతభావనమై యేమనసు ప్రవర్తించుచున్నదో యది సత్వ

మనఁబడును. అందునుండి గలుగుభావములు సాత్వికములౌను. అవి స్తంభమనియు, స్వేదమనియు, రోమాంచమనియు, స్వరభేదమనియు, వేపథువనియు, వైవర్ణ్యమనియు, అశ్రువనియు, ప్రళయమనియు నీయెనిమిది సాత్వికభావము లనఁబడును.

### స్తంభలక్షణం.

స్తంభో హర్షభయామర్షవిషాదాద్భుతసంభవః. 130
అనుభావో భవేదత్ర నిష్క్రియాంగత్వమేవ హి,

స్తంభమనుసాత్వికభావము సంతోషము,భయము, కోపము, విషాదము, అద్భుతము, వీనిచేఁగలుగు నిష్క్రియాంగత్వము.

### స్వేదలక్షణం.

నిదాఘహర్షవ్యాయామశ్రమక్రోధభయాదిభిః. 131
స్వేదస్సంజాయతే తత్ర త్వనుభావా భవంత్యమీ,
స్వేదాపనయవాతేచ్ఛావ్యజనగ్రహణాదయః. 132

ఎండ, సంతోషము, వ్యాయామము, శ్రమము, క్రోధము, భయము, మొదలైనవానిచేత స్వేదము (అనఁగాచెమట) కలుగును. అప్పుడు చెమటను తుడుచుకొనుట, గాలిని ఇచ్ఛయించుట, వ్యజనగ్రహణము మొదలైనఅనుభావములు గలుగును.

### రోమాంచలక్షణం.

రోమాంచో విస్మయోత్సాహహర్షాద్యైస్తత్ర విక్రియాః,
రోమోద్గమాద్యాః కథితా విక్రియాస్తత్ర కోవిదైః. 133

ఆశ్చర్యము, ఉత్సాహము, సంతోషము, మొదలైనవానిచేత రోమాంచము కలుగును. అందు గగుర్పొడుచుట మొదలయినవికారములు కలుగును.

### స్వరభేదలక్షణం.

స్వరభేదస్సుఖాద్యైస్తు తత్ర స్యుర్గద్గదాదయః,

సుఖాదులచే స్వరభేదము గలుగును. ఇందు డగ్గుత్తిక మొదలైనవి గలుగును.

### వేపథులక్షణం.

వేపథుర్హర్షసంత్రాసజ్వరక్రోధాదిభిర్భవేత్. 134
అత్రానుభావాః స్మరణగాత్రకంపాదయో మతాః,

సంతోషము, బెదరించుట, జ్వరము, కోపము, మొదలైనవానిచే వేపథువు గలుగును. ఇందు స్మరించుట, దేహమువణకుట, మొదలైనవి గలుగును.

### వైవర్ణ్యలక్షణం.

విషాదపరరోషాద్యై ర్వైవర్ణ్యముపజాయతే. 135
ముఖవర్ణపరావృత్తిః కార్శ్యాద్యాస్తత్ర విక్రియాః,

విషాదము, ఇతరులయందుఁ గలరోషము, మొదలైనవానిచే వైవర్ణ్యముగలుగును. ఇందు ముఖతేజస్సు మాఱుట, చిక్కిపోవుట, మొదలైనవి గలుగును.

### అశ్రులక్షణం.

విషాదరోషసంతోషధూమాద్యైరశ్రువిక్రియాః. 136
బాష్పబిందుపరిక్షేపనేత్రసమ్మార్జనాదయః,

వ్యసనము, కోపము, సంతోషము, ధూమము, మొదలైనవానిచే అశ్రువు గలుగును. ఇందు కన్నీరు విదిలించుట, కన్నులను తుడుచుకొనుట, మొదలయినవి కలుగును.

### ప్రళయలక్షణం.

ప్రళయస్సుఖదుఃఖాద్యైశ్చేతసస్తు విసంజ్ఞతా. 137

ప్రళయమనఁగా సుఖదుఃఖాదులచేఁ గలుగు ప్రజ్ఞాభంగము.

ఏతేషాం సత్వమూలత్వాత్ భావానాం సాత్వికప్రథా,
అనుభావాశ్చ కథితాః భావసంసూచనాదయః. 138
ఏవం ద్వైవిధ్యమేతేషాం దర్శితం భావకోవిదైః,

సత్వమూలములైనవిగనుక వీనికి సాత్వికభావములని పేరు. భావసంసూచనాదులు అనుభావము లనఁబడును. ఇట్లు అనుభావములు రెండువిధములు గలిగియుండును.

విభావా అనుభావాశ్చ తే భవంతి పరస్పరం. 139
కార్యకారణభావాశ్చ జ్ఞేయా భావవిశారదైః,

విభావానుభావములు ఒకటికొకటి కార్యకారణభావములుగాను భావజ్ఞులచే నెఱుఁగఁదగినవి.

ఇత్యనుభావాస్సమాప్తాః.

---

### అథ వ్యభిచారిభావా నిరూప్యంతే.

వ్యభీ ఇత్యుపసర్గౌ ద్వౌ విశేషాభిముఖత్వయోః. 140
విశేషేణాభిముఖ్యేన చరంతి స్థాయినం ప్రతి,
వాగంగసత్వయుక్తా యే జ్ఞేయాస్తే వ్యభిచారిణః. 141

పలుకు, దేహము, సత్వము, వీనితోఁగూడినవై స్థాయికి విశేషాభిముఖములుగాఁ దిరుగుభావములు వ్యభిచారిభావములని యెఱుఁగవలయును.

విచారయంతి వా సమ్యగితి సంచారిణోఽపి తే,

అవి స్థాయులను బాగుగ చరింపఁజేయుచున్నవిగనుక సంచారులని యును జెప్పఁబడును.

ఉన్మజ్జంతో నిమజ్జంతః స్థాయిన్యంబునిధావివ. 142
ఊర్మివద్వర్ధయంత్యేనం యాంతి తద్రూపతాం చ తే,

ఏభావములు స్థాయియందు సముద్రమందుండునలలవలె దానిని వృద్ధి బొందించి తద్రూపతను పొందుచున్నవో అవి వ్యభిచారిభావము లనఁబడును.

నిర్వేదాదయో నిరూప్యంతే.

నిర్వేదగ్లానిశంకాశ్చ తథాసూయామదశ్శ్రమః. 143
ఆలస్యం చైవ దైన్యం చ చింతా మోహో ధృతిః స్మృతిః,
వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా. 144
గర్వో విషాద ఔత్సుక్యం నిద్రాపస్మార ఏవ చ,
సుప్తిర్విబోధోఽమర్షశ్చ అవహిత్థాప్యథోగ్రతా. 145
మతిర్వ్యాధిస్తథోన్మాదః తథా మరణమేవ చ,
త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః. 146
త్రయస్త్రింశదమీ భావాః సమాఖ్యాతాస్తు నామతః,

నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత, మోహము, ధృతి, స్మృతి, వ్రీడ, చపలత, హర్షము, ఆవేగము, జడత, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుప్తి, విబోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రత, మతి, వ్యాధి, ఉన్మాదము మరణము, త్రాసము వితర్కము ఈముప్పదిమూఁడును వ్యభిచారిభావములని చెప్పఁబడును.

## నిర్వేదలక్షణం.

తత్త్వజ్ఞానాచ్చ దౌర్గత్యాదాపదో విప్రయోగతః. 147
దుఃఖాదేరపి నైష్ఫల్యమతిర్నిర్వేద ఉచ్యతే,

తత్త్వజ్ఞానము, పేదఱికము, సంకటము, వియోగము, దుఃఖము మొదలైనవానిచేఁ గలుగు ఫలాభావమతి నిర్వేద మనఁబడును.

## గ్లానిలక్షణం.

ఆధివ్యాధిజరాతృష్ణావ్యాయామసురతాదిభిః. 148
నిష్ప్రాణతా గ్లానిరత్ర క్షామాంగవచనక్రియాః,
కలానుత్సాహవైవర్ణ్యనయనభ్రమణాదయః. 149

మనోవ్యాధి, రోగము, ముసలితనము, దప్పి, వ్యాయామము, సురతము, ఇవి మొదలైనవానిచేఁ గలుగు దౌర్బల్యము గ్లానియగును. ఇందు దేహము చిక్కుట, సన్నపలుకులు, మెల్లనపనులు, కలావిషయములయందు ఉత్సాహములేకయుండుట, దేహవైవర్ణ్యము, గుడ్లుతిరుగుట మొదలైనవికారములు గలవు.

## శంకాలక్షణం.

శంకా చౌర్యాపరాధాద్యైః స్వానిష్టోత్ప్రేక్షణం మతం,
తత్ర చేష్టా ముహుః పార్శ్వవీక్షణం ముఖశోషణం. 150
అవకుంఠనవైవర్ణ్యకంఠసాదాదయోఽపి చ,

చౌర్యాపరాధాదులచేఁ దనకహితము నుత్ప్రేక్షించుట శంక యనఁబడును. ఇందు మాటిమాటికి పార్శ్వములనుచూచుట, మోమువాడుట, ముసుకిడుట, వైవర్ణ్యము, కంఠగద్గదము, మొదలైనచేష్టలు గలవు.

ద్వివిధా చేయమాత్మోత్థా పరోత్థా చేతి భేదతః. 151
స్వకార్యజనితా స్వోత్థా ప్రాయో వ్యంగ్యమింగితైః,
ఇంగితాని తు పక్ష్మ భ్రూతారకాదృష్టివిక్రియాః. 152
పరోత్థా తు పరస్వేదః పరస్యాకారతో భవేత్,
ప్రాయేణాకారచేష్టాద్యైః తామిమామనుభావయేత్. 153
ఆకారస్సాత్వికశ్చేష్టా స్త్వంగప్రత్యంగజాః క్రియాః,

ఈ శంక ఆత్మోత్థశంకయనియు, పరోత్థశంకయనియు నిరుదెఱఁగు లౌను. స్వకార్యమువలన కలుగునది స్వోత్థశంక. ఇందుఁగల ఇంగితములు ఱెప్ప, కనుబొమలు, నల్లగ్రుడ్లు, చూపు వీనియందు గలుగువికారములు. ఇతరుల ఆకారమువలన గలుగు చెమట పరోత్థశంక యనఁబడును. వరుసగా నాకారచేష్టాదులచే నీరెండువిధముల శంకను నూహింపవచ్చును. ఆకారము, సాత్వికము, చేష్టలు అంగప్రత్యంగములయందు గలుగు క్రియాభేదములు.

## అసూయా లక్షణం.

పరసౌభాగ్యసంపత్తివిద్యాశౌర్యాదిహేతుభిః. 154
గుణేఽపి దోషారోపస్స్యాదసూయా తత్ర విక్రియాః,
ముఖాపవర్తనం గర్హా భ్రూభేదానాదరాదయః. 155

ఇతరుల సౌభాగ్యము, సంపత్తి, విద్య, శౌర్యము, మొదలగు హేతువులచే గుణమందుఁగూడ దోషారోపణము చేయుట అసూయ యనఁబడును. ఇందు మోమును ద్రిప్పుట, నిందించుట, భ్రూభేదము, ఉపేక్ష ఇవి మొదలయిన క్రియలు గలవు.

## మదలక్షణం.

మదస్స్యాదానందసమ్మోహసంభ్రమో మదిరాదిజః,
స త్రిధా తరుణో మధ్యోఽపకృష్టశ్చేతి భేదతః. 156

మద మనునది మద్యము మొదలయిన వానిచేఁగలుగు ఆనందసమ్మోహములయొక్క సంభ్రమము. ఆమదము తరుణమదమనియు, మధ్యమదమనియు, అపకృష్టమదమనియు మూఁడువిధములు.

దృష్టిః స్మేరా ముఖే రాగః సస్మితాకులితం వచః,
లలితావిద్ధగత్యాద్యాశ్చేష్టాస్స్యుస్తరుణే మదే. 157

తరుణమదమందు గర్వపుఁజూపులు, ముఖమందు ఎఱుపు, చిఱునగవును సంభ్రమమును గలపలుకు, ఒయ్యారపు నడక, ఇవి మొదలయిన చేష్టలు గలుగును.

మధ్యమే తు మదే వాచి స్ఖలనం ఘూర్ణనం దృశోః,
గమనే వక్రతా బాహ్వోర్విక్షేపస్రస్తతాదయః. 158

మధ్యమమదమందు వాక్కున తడఁబాటు, గుడ్లుతిరుగుట, వంకరగనడచుట, చేతులనాడించుట, వ్రేలవేయుట, మొదలయినచేష్టలు గలవు.

అపకృష్టే తు చేష్టాస్స్యుర్గతిభంగో విసంజ్ఞతా,
నిష్ఠీవనం ముహుశ్శ్వాసో హిక్కా ఛర్ద్యాదయో మతాః.

అపకృష్టమదమందు గతిభంగము, మూర్ఛిల్లుట, తెలివితప్పియుండుట, ఉమియుట, వెక్కిళ్లు, వాంతి మొదలయిన చేష్టలు గలుగును.

ఉత్తమప్రకృతిశ్శేతే మధ్యో హసతి గాయతి,
అధమప్రకృతిర్గ్రామ్యం పరుషం వక్తి రోదితి. 160

ఉత్తమమదమును గలవాఁడు పండుకొనియుండును. మధ్యమమదమును గలవాఁడు నవ్వుచుఁబాడుచునుండును. అధమమదమును గలవాఁడు క్రూరముగను వికారముగను మాటలాడుచును దుఃఖించుచునుండును.

## శ్రమలక్షణం

శ్రమో మానసఖేదస్స్యాదధ్వనృత్తరతాదిభిః,
అంగమర్దననిశ్వాసపాదసంవాహనాని చ. 161

జృంభణం మందయానత్వం ముఖనేత్రవికూణనమ్,
సీత్కృతిశ్చేతి విజ్ఞేయా అనుభావాశ్శ్రమోత్థితాః. 162

త్రోవనడచుట, నృత్తమాడుట, క్రీడ మొదలయిన వ్యాపారములచేఁ గలుగు మానసఖేదము శ్రమమనఁబడును. ఇందు అంగమర్దనము, నిట్టూర్పు, కాళ్లుపిసుకుట, ఆవలింత, మందముగనడచుట, ముఖమునుకన్నులను వంకర చేసికొనుట, సత్కారము చేయుట ఈ అనుభావములు గలుగును.

ఆలస్యలక్షణం.

స్వభావభయసౌహిత్యగర్వనిర్భయతాదిభిః,
కృచ్ఛ్రక్రియోన్ముఖత్వం యత్తదాలస్యమిహ క్రియాః.
అంగభంగక్రియాద్వేషజృంభణాక్షివిమర్దనాః,
శయ్యాసనైకప్రియతా తంద్రీనిద్రాదయోఽపి చ. 164

స్వభావము, భయము, తృప్తి, గర్వము, భయములేకయుండుట మొదలగువానిచేత కష్టమున పనులను జేయయత్నించుట, ఆలస్య మనఁబడును. ఇందు అంగభంగము, క్రియాద్వేషము, ఆవలింత, నేత్రములు నలుపుట, పండుకొనుటయందును కూర్చుండుటయందును ముఖ్యముగా ప్రియముగలుగుట, కన్నులు మూతలుపడుట, నిదుర మొదలయిన క్రియలు గలుగును.

దైన్యలక్షణం.

హృత్తాపదుర్గతత్వాద్యైరనౌద్ధత్యం హి దీనతా,
అత్రానుభావా మాలిన్యగాత్రస్తంభాదయో మతాః. 165

మనస్తాపము, పేదఱికము మొదలయినవానిచేఁ గలుగు అణఁకువ దైన్య మనఁబడును. ఇందుకు మాలిన్యదేహస్తంభాద్యనుభావములు గలుగును.

చింతాలక్షణం.

ఇష్టవస్త్వపరిప్రాప్తేరైశ్వర్యభ్రంశనాదిభిః,
చింతా ధ్యానాత్మికా తస్యామనుభావా భవంత్యమీ. 166

కార్శ్యాధోముఖ్యసంతాపనిశ్వాసోచ్ఛ్వసనాదయః,

ప్రియవస్తువులు లభింపనందువలన నైశ్వర్యభ్రంశనము మొదలయిన వానిచేతఁగలుగుధ్యానము చింతయనఁబడును. ఇందు మేనుచిక్కుట, తలవంపు, సంతాపము, నిట్టూర్పు మొదలయినవి గలుగును.

### మోహలక్షణం.

ఆపద్భీతివియోగాద్యైర్మోహశ్చిత్తస్య మూఢతా,
విక్రియాస్తత్ర విజ్ఞేయా ఇంద్రియాణాం చ శూన్యతా.
నిశ్చేష్టతాంగభ్రమణపతనాఘూర్ణనాదయః,

ఆపత్తు, భయము, వియోగము మొదలైనవానిచే మనస్సున కేమియుఁ దెలియకపోవుట మోహ మనఁబడును. ఇందు ఇంద్రియములు శూన్యముగ నుండుట, చేష్టలులేకయుండుట, దేహము తిరుగుట, గ్రుడ్లు గిరిగిరలాడుట ఇవి మొదలైనవి క్రియలు గలుగును.

### ధృతిలక్షణం.

జ్ఞానవిజ్ఞానగుర్వాది భక్త్యర్థానార్థసిద్ధితః 168
లజ్జాదిభిశ్చ చిత్తస్య నైస్పృహ్యం ధృతిరుచ్యతే,
అత్రానుభావా విజ్ఞేయా ప్రాప్తార్థానుభవస్తథా. 169
అప్రాప్తాతీతనష్టార్థానభిసంశోభణాదయః,

మోక్షవిషయకజ్ఞానము, శాస్త్రజ్ఞానము, గురుభక్తి, నానావిషయములసిద్ధి, సిగ్గు మొదలైనవానిచేత మనస్సునకు ఇచ్ఛలేకయుండుట ధృతి యనఁబడును. ఇందులభించినదానిని అనుభవించుట, పొందఁబడనివిషయములు కడచినవిషయములు, నష్టవిషయములు వీనికిగా మనస్సున చింతలేక యుండుట, మొదలయినవి గలుగును.

## స్మృతిలక్షణం.

స్వతశ్చిత్తదృఢాభ్యాసాత్ సదృశాలోకనాదిభిః. 170
స్మృతిః పూర్వానుభూతార్థప్రతీతి స్తత్ర విక్రియాః,
కంపనోద్వేపనే మూర్ధ్నో భ్రూవిక్షేపాదయోఽపి చ. 171

మనోభ్యాసబలముచేత తనంతటను సమానవస్తువుల చూచుట మొదలైనవానిచేఁగలుగు పూర్వానుభూతార్థజ్ఞానము స్మృతి యనఁబడును. ఇందు శిరస్సును ఆడించుట, ఊఁచుట, కనుబొమలవిక్షేపములు మొదలైనవిగలుగును.

## వ్రీడాలక్షణం.

అకార్యకరణావజ్ఞాస్తుతినూతనసంగమైః,
ప్రతీకారక్రియాద్యైశ్చ వ్రీడా త్వనతిధృష్టతా. 172
తత్ర చేష్టా నిగూఢోక్తిరాధోముఖ్యవిచింతనే,
అనిర్గమో బహిర్వాపి దూరాదేవావకుంఠనం. 173
నఖానాం కృంతనం భూమిలేఖనం చైవమాదయః,

అకార్యముఁజేయుట, అవమానము, స్తోత్రము, నూతనసంగమము, ప్రతికారక్రియ మొదలైనవానిచేత అతిధార్ష్ట్యములేకయుండుట వ్రీడ యనఁబడును. ఇందు మఱుఁగుగమాటాడుట, తలవంచుట, యోచించుట, బయట రాకుండుట, దూరముగానే ముసుగిడుట, గోళ్లుగిల్లుట, నేలగీరుట ఇవి మొదలైనవి గలుగును.

## చపలతాలక్షణం.

రాగద్వేషాదిభిశ్చిత్తే లాఘవం చాపలం భవేత్. 174
చేష్టాస్తత్రావిచారేణ పరిరంభావలోకనే,
నిష్కాసనోక్తిపారుష్యే తాడనాజ్ఞాపనాదయః. 175

ఆస, ద్వేషము, మొదలైనవానిచే మనస్సులోఁ గలుగు లాఘవము చాపలమౌను. అందు యోచింపక కౌఁగిలించుకొనుట, చూచుట, వెళ్లుమనుట, కఠినపుమాటలు, కొట్టుట, ఆజ్ఞాపించుట మొదలైనచేష్టలు గలుగును.

### హర్షలక్షణం.

మనోరథస్య లాభేన సిద్ధియోగ్యస్య వస్తునః,
మిత్రసంగాచ్చ దేవాదిప్రసాదేన చ కల్పితః. 176
మనఃప్రసాదో హర్షస్స్యాదత్ర నేత్రాస్యఫుల్లతా,
ప్రియభాషణమాశ్లేషః పులకానాం ప్రరోహణం. 177
స్వేదోద్గమశ్చ హస్తేన హస్తసంతాడనాదయః,

మనోరథముయొక్క సిద్ధియోగ్యమైనవస్తువుయొక్క లాభము చేతను, మిత్రులసంగమము చేతను, దేవతాదులప్రసాదము చేతను గల్గింపఁబడిన మనః ప్రసాదము హర్ష మనఁబడును. ఇందు ముఖము కన్నులు వికసించుట, ప్రియముపలుకులు, కౌఁగిలించుట, పులకరించుట, చెమటగలుగుట, చేతులు తట్టుట మొదలైనవి గలుగును.

### ఆవేగలక్షణం.

చిత్తస్య సంభ్రమో యస్స్యాదావేగోఽయం స చాష్టధా.
ఉత్పాతవాతవర్షాగ్నిమత్తకుంజరదర్శనాత్,
ప్రియాప్రియశ్రుతేశ్చాపి శాత్రవవ్యసనాదపి. 179

మనసుయొక్క తడబాటు ఆవేగమౌను. ఆయావేగము ఉత్పాతావేగమనియు, వాతావేగమనియు, వర్షావేగమనియు, అగ్న్యావేగమనియు, మత్తకుంజరదర్శనావేగమనియు, ప్రియశ్రవణావేగమనియు, అప్రియశ్రవణావేగమనియు, శాత్రవవ్యసనావేగమనియు కారణానుసారముగా నెనిమిది తెఱఁగు లగును.

**ఉత్పాతావేగో యథా.**

తత్రోత్పాతస్తు శైలాదికంపకేతూదయాదయః,
తజ్జస్సర్వాంగవిస్రంసో వైమనస్యాపసర్పణే. 180

అందు కొండమొదలైనవి కదలుట, తోఁకచుక్క పుట్టుట మొదలైనవి **ఉత్పాత** మౌను. దీనివలనగలిగిన సర్వాంగవిస్రంసము, వైమనస్యము, అపసర్పణము ఇవి **ఉత్పాతావేగ** మనఁబడును.

**వాతావేగో యథా.**

త్వరయా గమనం వస్త్రాహరణం చావకుంఠనం,
నేత్రావమార్జనాద్యాశ్చ వాతావేగభవాః క్రియాః. 181

వేగముగనడచుట, వస్త్రములను తీసికొనుట, కప్పుకొనుట, కన్నులను తుడుచుకొనుట మొదలైనవి పెద్దగాలిచేఁగలుగు క్రియలు.

**వర్షావేగో యథా.**

ఛత్రగ్రహోఽంగసంకోచబాహుస్వస్తికధావనే,
ఛన్నాశ్రయణమిత్యాద్యా వర్షావేగభవాః క్రియాః. 182

గొడుగునుగ్రహించుట, దేహముచిన్నదవుట, చేతులను భుజమూలములయందుఁజేర్చుట, పరుగిడుట, గుప్తస్థలము నాశ్రయించుట మొదలైనవి వర్షావేగముచేఁ గలుగుక్రియలు.

**అగ్న్యావేగో యథా.**

అగ్న్యావేగభవాశ్చేష్టా వీజనం చాంగధూననం,
వ్యత్యస్తపాదవిక్షేపనేత్రసంకోచనాదయః. 183

అగ్న్యావేగమందుఁ గలుగుచేష్టలు వీజనము, అంగధూననము, వ్యత్యాసముగ నడుగులుంచుట, నేత్రసంకోచము ఇవి మొదలైనవి.

మత్తకుంజరదర్శనావేగో యథా.

ఆవేగే కుంజరోద్భూతే సత్వరం వాపసర్పణం,
విలోకనం ముహుః పార్శ్వే త్రాసకంపాదయోఽపి చ.

ఏనుఁగు చేఁ గలుగునావేగమందు త్వరగా పరుగెత్తిపోవుట, ప్రక్కలకు తిరిగితిరిగిచూచుట, భయము, వణకు మొదలైనవి గలుగును.

ప్రియశ్రవణజావేగో యథా.

ప్రియశ్రవణజేఽప్యస్మిన్నభ్యుత్థానోపగూహనే,
ప్రీతిదానం ప్రియం వాక్యం రోమహర్షాదయోఽపి చ.

ఈ ప్రియశ్రవణజావేగమందు అభ్యుత్థానము, ఆలింగనము జేసికొనుట, ప్రీతిపురస్సరముగ వస్త్రాభరణాదులనిచ్చుట, ప్రియమైనవాక్యము, రోమాంచము మొదలైనవి గలుగును.

అప్రియశ్రవణావేగో యథా.

అప్రియశ్రుతిజేఽప్యస్మిన్విలాపః పరిలుంఠనం,
ఆక్రందితం చ పతనం పరితో భ్రమణాదయః. 186

అప్రియశ్రవణావేగమందు ఏడుపు, పొరలాడుట, మొరపెట్టుట, క్రిందఁబడుట, అంతటఁదిరుగుట మొదలైనవి గలుగును.

శాత్రవవ్యసనావేగో యథా.

చేష్టాస్స్యుశ్శాత్రవావేగే వర్మశస్త్రాదిధారణం,
గజవాజిరథారోహ సహసా విక్రమాదయః. 187
ఏతే స్యురుత్తమాదీనామనుభావా యథోచితం,

శాత్రవావేగమందు కవచము ఆయుధము మొదలైనవస్తువులను ధరించుట, ఏనుఁగు గుఱ్ఱము రథము వీనినెక్కుట, త్వరగా విక్రమించుట మొదలైనవి గలుగును. ఇవి ఉత్తమాదులకు యథోచితముగఁ గలుగును.

### జడతాలక్షణం.

జాడ్యమప్రతిపత్తిస్స్యాదిష్టానిష్టార్థయోశ్శ్రుతేః. 188
వృష్టేర్వా విరహాదిభ్యః క్రియా స్తత్రానిమేషతా,
అశ్రుతిః పారవశ్యం చ తూష్ణీంభావాదయోఽపి చ. 189

ఇష్టార్థము అనిష్టార్థము వీనివినికివలనఁగాని, వర్షమువలనఁగాని, విరహము మొదలైనవానివలనగాని కలుగుఅజ్ఞానము జాడ్య మౌను. ఇందు ఱెప్పపాటులేకయుండుట, చెవులువినకయుండుట, పరవశుఁడౌట, ఊరకయుండుట మొదలగుచేష్టలు గలుగును.

### గర్వలక్షణం.

ఐశ్వర్యరూపతారుణ్యకులవిద్యాబలైరపి,
ఇష్టలాభాదినాన్యేషామవజ్ఞా గర్వ ఉచ్యతే. 190
అనుభావా భవంత్యత్ర గుర్వాద్యాజ్ఞావ్యతిక్రమః,
అనుగ్రహప్రదానం చ వైముఖ్యాభాషణాదయః. 191
విభ్రమాపహ్నుతేవాక్యపారుష్యమనవేక్షణం,
ఆవేక్షణం నిజాంగానామంగభేదాదయోఽపి చ. 192

ఐశ్వర్యము, రూపము, యౌవనము, కులము, విద్య, బలము, ఇష్టలాభము మొదలైనవానిచేత నొరులనవమానించుట గర్వ మనఁబడును. ఇందు అహంభావము, ఆజ్ఞోల్లంఘనము, అనుగ్రహప్రదానము, మోముత్రిప్పుకొనుట, మాటలాడకయుండుట, మొదలైనవియు, పరుషముగమాటలాడుట, చూడకయుండుట, తనయవయవములను జూచుకొనుట, ఒడలువిఱుచుకొనుట మొదలైనయనుభావములు గలుగును.

### విషాదలక్షణం.

ప్రారబ్ధకార్యానిర్వాహాదిష్టాప్రాప్తేర్విపత్తితః,
అపరాధపరిజ్ఞానాదనుతాపస్తు యో భవేత్. 193

విషాద ఇతి విఖ్యాతో భరతార్ణవపారగైః,
స విషాదస్త్రిధా జ్యేష్ఠమధ్యమాధమసంశ్రయాత్. 194

తానారంభించినపని సాగకుండుట, ఇష్టపదార్థాప్రాప్తి, విపత్తు, తప్పు నెఱుఁగుట వీనివలనఁగలుగు ననుతాపము విషాద మనఁబడును. ఆవిషాదము ఉత్తమ, మధ్యమ, అధమములయాశ్రయమువలన మూఁడు తెఱఁగులు గలది యగును.

—జ్యేష్ఠవిషాదో యథా.—

సహాయాన్వేషణోపాయచింతాద్యా ఉత్తమే స్మృతాః,

ఉత్తమునివిషాదమందు సహాయమును వెదకుట, ఉపాయచింత మొదలైనవ్యాపారములు గలుగును.

—మధ్యమవిషాదో యథా.—

అనుత్సాహశ్చ వైచింత్యం వైక్లబ్యమవిలోకనం. 195
విషాదే మధ్యమే ప్రోక్తా భ్రాంత్యాద్యాశ్చైవ విక్రియాః,

మధ్యమునివిషాదమందు ఉత్సాహము లేకయుండుట, మిక్కిలిచింతించుట, కార్యాకార్యములు తెలియకయుండుట, ఎవరిని తలయెత్తి చూడకుండుట, భ్రమించుట మొదలయిన క్రియలు గలుగును.

—అధమవిషాదో యథా.—

రోదనశ్వసితధ్యానముఖశోషాదయోఽధమే. 196

అధమునివిషాదమందు రోదనము, నిట్టూర్పు, ధ్యానము, ముఖము వంకర మొదలైనవి గలుగును.

—ఔత్సుక్యలక్షణం.—

కాలాక్షమత్వమౌత్సుక్యం అభిలాషాదిహేతుజం,
త్వరయా గమనం శయ్యాస్థితేరుత్థానచింతనే. 197

శరీరగౌరవాద్యాశ్చ అనుభావా ఇహ స్మృతాః,

ఆస మొదలైనవానిచేఁ గలుగుజాగును తాళలేకయుండుట ఔత్సుక్య మనఁబడును. ఇందు వేగముగనడచుట, పడకలోనుండిలేచుట, చింతించుట, శరీరముబరువగుట మొదలైనవి గలుగును.

## నిద్రాలక్షణం.

మందస్వభావవ్యాయామనిశ్చింతత్వసమాధిభిః. 198
మనోనిమీలనం నిద్రా చేష్టాస్తత్రాస్యగౌరవం,
ఆఘూర్ణమాననేత్రత్వమంగానాం పరివర్తనం. 199
నిశ్వాసోచ్ఛ్వసితే గాత్రస్వేదో నేత్రనిమీలనం,
శరీరస్య తు సంకోచో జాడ్యం చేత్యేవమాదయః. 200

మందస్వభావము, వ్యాయామము, నిశ్చింతత, సమాధి, వీనిచేఁగలుగు మనోనిమీలనము నిద్ర యనఁబడును. ఇందు ముఖగౌరవము, కన్నులుజోలాయించుట, అంగములపరివర్తనము, ఉచ్ఛ్వాసనిశ్వాసములు, దేహమందు చెమటపోయుట, నేత్రములు మూతపడుట, దేహసంకోచము, తెలివిలేకయుండుట ఇవి గలుగును.

## అపస్మారలక్షణం.

ధాతువైషమ్యదోషేణ భూతావేశాదినా కృతః,
చిత్తక్షోభస్త్వపస్మారః తత్ర చేష్టాః ప్రకంపనం. 201
ధావనం పతనం స్తంభో భ్రమణం నేత్రవిక్రియా,
స్ఫోటదంశభుజాక్షేపలాలాఫేనాదయోఽపి చ. 202

వాతపిత్తశ్లేష్మధాతువులహెచ్చుతక్కువ, దోషము, దయ్యముసోకుట మొదలైనవానిచేతఁజేయఁబడిన మనస్సుయొక్క క్షోభము అపస్మార మనఁబడును. ఇందు వణఁకుట, పరుగెత్తుట, పడుట, కదలకుండుట, తిరుగుట, నేత్ర

ములవిక్రియ, స్ఫోటము (భేదనము) పండ్లుకొఱుకుట, చేతులువిసరుట, చొల్లు-కారుట, నురుగుగలుగుట మొదలైనవి గలుగును.

## సుప్తిలక్షణం.

ఉద్రేక ఏవ నిద్రాయాస్సుప్తిస్స్యాత్తత్ర విక్రియాః,
ఇంద్రియోపరతిర్నేత్రమీలనం ప్రస్తగాత్రతా. 203
ఉత్స్వప్నాయతనైశ్చల్యశ్వాసోచ్ఛ్వాసాదయోఽపి చ,

నిదురయొక్క ఆధిక్యమే సుప్తి యనఁబడును. ఇంద్రియములు ఉపరతినిబొందియుండుట, కన్నులుమూసియుండుట, గాత్రము ప్రస్తమైయుండుట, కలగనుట, దీర్ఘకాలము కదలకయుండుట, ఉచ్ఛ్వాసనిశ్వాసములు మొదలైనవి గలుగును.

## విబోధలక్షణం.

విబోధశ్చేతనావాప్తిశ్చేష్టాస్తత్రాక్షిమర్దనం. 204
శయ్యాయా మోక్షణం బాహువిక్షేపోఽంగుళిమోటనం,
శిరఃకండూయనం చాంగవలనం చైవమాదయః. 205

నిదురమేలుకొనుట విబోధ మనఁబడును. ఇందు కన్నులు నలుపుకొనుట, పడకను విడుచుట, బాహువిక్షేపము, అంగుళిమోటనము, (బొటనవ్రేళ్లులాగికొనుట), తలనుగోకుకొనుట, దేహమును ద్రిప్పుట మొదలైనవి గలుగును.

## అమర్షలక్షణం.

అధిక్షేపావమానాద్యైః క్రోధోఽమర్ష ఇతీరితః,
తత్ర స్వేదశ్శిరఃకంప అధోముఖ్యవిచింతనే. 206
ఉపాయాన్వేషణోత్సాహవ్యవసాయాదయః క్రియాః,

తక్కువచేయుట, అవమానముచేయుట మొదలయినవానిచేతఁగలుగు క్రోధము అమర్ష మనఁబడును. అందు స్వేదము, శిరఃకంపము, తలవంచుకొనుట,

చింతించుట, ఉపాయములను వెతకుట, ఉత్సాహము, వ్యవసాయము మొదలయినవి గలుగును.

### అవహిత్థాలక్షణం.

అవహిత్థాకారగుప్తిః ధైర్యప్రాభవనీతిభిః. 207
లజ్జాసాధ్వసదాక్షిణ్యప్రాగల్భ్యాపజయాదిభిః,
అన్యథాపాదనం మిథ్యాధైర్యమన్యత్ర వీక్షణం. 208
కథాభంగాదయోఽప్యస్యా అనుభావా భవంత్యమీ,

ధైర్యము, ప్రాభవము, నీతి, సిగ్గు; సాధ్వసము, దాక్షిణ్యము, ప్రాగల్భ్యము, అపజయము ఇవి మొదలయినవానిచేఁగలుగు ఆకారగుప్తి అవహిత్థ యనఁబడును. ఇందు వేరుగఁజెప్పుట, అబద్ధపుధైర్యము, మఱియొకప్రక్క చూచుట, కథాభంగము మొదలయినవి గలుగును.

### ఉగ్రతాలక్షణం.

అపరాధాపమానాభ్యాం చౌర్యనిగ్రహణాదిభిః. 209
అసత్ప్రలాపనాద్యైశ్చ కృతం తూర్ణత్వముగ్రతా,
క్రియాస్తత్రాస్య నయనరాగో బంధనతాడనే. 210
శిరసః కంపనం స్వేదవర్ధనం భర్త్సనాదయః,

అపరాధము, అవమానము, దొంగతనము, నిగ్రహము, అసత్ప్రలాపము మొదలయినవానిచేఁ జేయఁబడినత్వర ఉగ్రత యనఁబడును. అందు కన్నులు ముఖము ఎఱ్ఱనౌట, బంధించుట, కొట్టుట, తలయాడించుట, చెమటపోయుట, బెదరించుట మొదలయినవి కలుగును.

### మతిలక్షణం.

నానాశాస్త్రార్థకథనాదర్థనిర్ధారణం మతిః. 211
అత్ర చేష్టాస్తు కర్తవ్యకరణం సంశయచ్ఛిదా,
శిష్యోపదేశో భ్రూక్షేప ఊహాపోహాదయోఽపి చ. 212

అనేకశాస్త్రార్థములను జెప్పుటవలనఁగలుగు అర్థనిర్ణయము మతి యనఁబడును. ఇందు యుక్తమగుపనులను జేయుట, సంశయమును బోఁగొట్టుట, శిష్యోపదేశము, కనుబొమల నాడించుట, ఊహాపోహములు మొదలయినవి గలుగును.

### వ్యాధిలక్షణం.

దోషోద్రేకవియోగాద్యైః జ్వరాత్మా వ్యాధిరుచ్యతే,
గాత్రస్తంభః శ్లథాంగత్వం కూజితం ముఖకూణనం. 213
వృథాకృతాంగవిక్షేపో నిశ్వాసాద్యాస్తు విక్రియాః,
స శీతోదాహయుక్తశ్చ ద్వివిధః పరికీర్తితః. 214

దోషోద్రేకముచేతను, వియోగాదులచేతను గలుగుజ్వరము వ్యాధి యనఁబడును. ఇందు దేహము స్తంభించుట అంగము బిగితగ్గుట, అఱచుట, ముఖము వంకరపోవుట, వ్యర్థముగనంగవిక్షేపముఁజేయుట, నిట్టూర్పు మొదలయినవిగలుగును. ఆజ్వరముశీతజ్వరమని, దాహజ్వరమనిన్ని ఇరుదెరంగు లౌను.

### శీతజ్వరవ్యాధిర్యథా.

శీతజ్వరే తు చేష్టాస్స్యుస్సంతాపశ్చాంగసాదనం,
హనుసంచలనం బాష్పః సర్వాంగోత్కంపకూజితే, 215
జానుకంపనరోమాంచముఖశోషాదయోఽపి చ,

శీతజ్వరమందు తాపము, దేహము చిక్కుట, చెక్కిళ్లు చలించుట, కన్నీరు, సర్వాంగమును వణకుట, అఱచుట, మోకాళ్లు వణకుట, పులకరింపు, ముఖమువాడుట, మొదలయినవి గలుగును.

### దాహజ్వరో యథా.

దాహజ్వరే తు విజ్ఞేయాశ్శీతమాల్యాదిధారణం. 216
పాణిపాదపరిక్షేపముఖశోషాదయోఽపి చ,

దాహజ్వరమందు చల్లనిపూలదండ మొదలయినవానిని ధరించుట చేతులుకాళ్లు ఎత్తెత్తివేయుట, మొగము వాడిపోవుట మొదలయినవిగలుగును.

## ఉన్మాదలక్షణం.

ఉన్మాదశ్చిత్తవిభ్రాంతిః వియోగాదిష్టనాశతః. 217

వియోగము, ఇష్టనాశనము వీనివలన గలుగుచిత్తవిభ్రమము, ఉన్మాదమనఁబడును.

## వియోగజోన్మాదో యథా.

వియోగజే తు చేష్టాస్స్యుర్ధావనం పరిదేవనం,
అసంబద్ధప్రలపనం శయనం సహసోద్ధతిః. 218
అచేతనైస్సహాలాపో నిర్నిమిత్తస్మితాదయః,

వియోగజోన్మాదమందు పరుగెత్తుట, పరిదేవనము, సంబంధములేనిపలుకులుపలుకుట, పండుకొనియుండుట, త్వరగాలేచుట, ప్రాణములేనివానితో మాటలాడుట, కారణములేక నవ్వుట, మొదలయినవి గలుగును.

## ఇష్టనాశోన్మాదో యథా.

ఇష్టనాశకృతోన్మాదే భస్మాదిపరిలేపనం. 219
నృత్తగీతాదిరచనా తృణాదేర్మాల్యధారణం,
అత్రోన్మాదేఽపి సకలా ప్రాగుక్తా విక్రియా మతాః. 220

ఇష్టనాశోన్మాదమందు భస్మము మొదలయినవానిని బూసికొనుట, నృత్తము గీతము మొదలయినవిచేయుట, తృణము మొదలయినవానిదండలను ధరించుట, ఇవియును వియోగజోన్మాదమందుఁ జెప్పినక్రియలును గలుగును.

## మరణలక్షణం.

వాయోర్ధనంజయస్యాపి విప్రయోగో మహాత్మనః,
శరీరావచ్ఛేదవతో మరణం నామ తద్భవేత్. 221

ఏతచ్చ ద్వివిధం ప్రోక్తం వ్యాధిజం చాభిఘాతజం,

సర్వాంగవ్యాపిగానుండు ధనంజయవాయువుయొక్క నిర్గమము మరణమనఁబడును. ఈమరణము వ్యాధిజమని, అభిఘాతజమని, ఇరుదెఱఁగు లౌను.

వ్యాధిజమరణం యథా.

ఆద్యే త్వసాధ్యవ్యాధ్యుత్థాలా విషూచ్యాదిసముద్భవే. 222
అనుభావా అమీ ప్రోక్తా అవ్యక్తాక్షరభాషణం,
వివర్ణగాత్రతా మందశ్వాసో క్తిస్తంభమీలనాః. 223
హిక్కా పరిజనాపేక్షా నిశ్చేష్టేంద్రియతాదయః,

అసాధ్యమైన వ్యాధ్రోగము విషూచిమొదలయినవానిచేతఁ గలుగునది వ్యాధిజమరణమందు - తొట్రుకుచుమాటలాడుట, దేహకాంతిమాఱిపోవుట, మెల్లఁగా శ్వాసమువిడుచుట, మాటనిలిచిపోవుట, నేత్రమీలనము, హిక్క, పరిజనములనపేక్షించుట, ఇంద్రియచేష్టలణఁగుట, మొదలయినవి గలుగును.

అభిఘాతమరణం యథా.

ద్వితీయం ఘాతపతనదేహోద్బంధవిషాదిజం. 224
తత్ర ఘాతభవే భూమిపతనక్రందనాదయః,
విషం తు వత్సనాభాద్యమష్టావేతాస్తదుద్భవాః. 225
కార్శ్యం కంపో దాహో హిక్కా ఫేనశ్చ కంధరాభంగః,
జడతా మృతిరితి కథితాః పతనాద్యభిఘాతజాశ్చేష్టాః. 226

ఘాతము, పడుట, దేహబంధనము, విషము, వీనిచేఁగలుగునది యభిఘాతజమరణము. అందు ఘాతజమందు నేలఁబడుట, ఏడ్చుట, మొదలయినవి. వసనాభిమొదలయినది విషము. పతనాదులయినయభిఘాతమువలనఁగలుగు చేష్టలు-చిక్కిపోవుట, వణఁకుట, తాపము,హిక్క, ఫేనము, కంధరాభంగము, జడత, మరణము మొదలయినవి.

## త్రాసలక్షణం.

త్రాసస్స్యాచ్చిత్తచాంచల్యం విద్యుత్క్రవ్యాదగర్జితైః,
తథాభూతభుజంగాద్యైర్జ్ఞేయాస్తత్ర విక్రియాః. 227
ఉత్కంపగాత్రసంకోచ రోమాంచస్తంభగద్గదాః,
ముహుర్నిమేషో విభ్రాంతిపార్శ్వస్థాలంబనాదయః. 228

మెఱపు, రాక్షసులు, ఉఱుము, పిశాచము, సర్పము మొదలైనవాని చేఁగలుగు చిత్తచాంచల్యము త్రాస మనఁబడును. ఇందు ఉత్కంపము, దేహసంకోచము, రోమాంచము, స్తంభము, గద్గదము, అడుగడుగునకు ఱెప్పపాట్లు, భ్రమ, ప్రక్కనుండువారిని పట్టుకొనుట మొదలయినవి గలుగును.

## వితర్కలక్షణం.

ఊహో వితర్కస్స్యం దేహవిమర్శప్రత్యయాదిభిః,
జనితో నిర్ణయోఽర్థస్య అసత్యస్సత్య ఏవ చ 229
అత్రానుభావాస్స్యరమీ భ్రూశిరఃకంపనాదయః,

సందేహము, నిశ్చయము మొదలయినవానిచేఁ గలుగు ఊహాత్మకమును సత్యాసత్యనిర్ణయము వితర్క మనఁబడును. దీనియందు కనుబొమ లెగురవేయుట, తలయూఁడించుట మొదలయిన యనుభావములు గలుగును.

ఉత్తమాధమమధ్యేషు సాత్వికవ్యభిచారిణః. 230
విభావా అనుభావాశ్చ వర్ణనీయా యథోచితం,

ఉత్తమ అధమ మధ్యమ స్వభావముగలవారియందు విభావానుభావసాత్వికభావవ్యభిచారిభావములు యథోచితముగ వర్ణింపఁదగినవి.

స్వాతంత్ర్యాత్పారతంత్ర్యాచ్చ ద్వివిధా వ్యభిచారిణః. 231
పరపోషకతాం ప్రాప్తాః పరతంత్రా ఇతీరితాః,
తదభావే స్వతంత్రాస్స్యుః భావా ఇతి చ తే స్మృతాః. 232

వ్యభిచారిభావములు స్వాతంత్ర్యపారతంత్ర్యములవలన ఇరుదెఱఁగు లౌచున్నవి. ఇతరపోషణమును బొందినపుడు పరతంత్రములనియును, అటు లేకున్నపుడు స్వతంత్రములనియును జెప్పఁబడును.

వ్యభిచారిభావానాం దశాచతుష్టయలక్షణం.

ఉత్పత్తిసంధిశాబల్యశాంతయో వ్యభిచారిణాం,
దశాశ్చతస్రస్స్యుస్తేషాముత్పత్తిర్భావసంభవః. 233
సరూపమసరూపం వా భిన్నకారణకల్పితం,
భావద్వయం మిళతి చేత్స సంధిరితి కథ్యతే. 234
శబళత్వం హి భావానాం సంమర్దస్స్యాత్పరస్పరం,
అత్యారూఢస్య భావస్య విలయశ్శాంతిరుచ్యతే. 235

ఉత్పత్తియని, సంధియని, శాబళ్యమని, శాంతియనియు వ్యభిచారి భావములకు నాలుగవస్థలు గలవు. ఇందు ఉత్పత్తియనునది భావముగలుగుట. సరూపములైనను, అసమానరూపములైనను భిన్నకారణములచేతఁ గల్పితములైన రెండుభావములు చేరనేని సంధి యనఁబడును. భావములు ఒకదానినొకటియొరయుట శబళత్వ మనఁబడును. అత్యారూఢమైన భావముయొక్క లయము శాంతి యనఁబడును.

ఆభాసతా భవేదేషామనౌచిత్యప్రవర్తనం,
అసత్యత్వాదయోగ్యత్వాదనౌచిత్యం ద్విధా మతం. 236

ఈభావములకు అనౌచిత్యప్రవర్తనము ఆభాసత యనఁబడును. ఆయనౌచిత్యము అసత్యానౌచిత్యమనియుఁ, అయోగ్యానౌచిత్యమనియు ఇరుదెఱఁగులౌను.

అనౌచిత్యద్వితయలక్షణం.

అసత్యత్వకృతం తత్స్యాదచేతనగతం తు యత్,
అయోగ్యత్వకృతం ప్రోక్తం నీచతిర్యగ్గడాశ్రయం. 237

అచేతనగతమైయుండునది అసత్యముచేతఁ జేయఁబడినది యగును. నీచతిర్యగ్జడాశ్రయమైయుండునది అయోగ్యత్వకృతమని చెప్పఁబడును.

## అథ స్థాయినో నిరూప్యంతే.

సజాతీయైర్విజాతీయైర్భావై ర్యేత్వతిరస్కృతాః,
క్షీరాబ్ధివన్నయంత్యన్యాన్ స్వాత్మత్వం స్థాయినో హి తే.
తే త్వష్టావితి విజ్ఞేయాః స్థాయినో మునిసమ్మతాః,
రత్యుత్సాహౌ చ శోకశ్చ విస్మయశ్చ తతఃపరం. 239
హాసో భయజుగుప్సే చ క్రోధో నాట్యే ప్రకీర్తితాః,

సజాతీయవిజాతీయభావములచేత అతిరస్కృతములై క్షీరసముద్రము వలెనే ఇతరభావములను స్వాత్మత్వమునుబొందించుకొనునవి స్థాయిభావములు. అవి యెనిమిదివిధములని ఋషులచే నొప్పఁబడినవి. వానిపేళ్లు వివరింపఁబడుచున్నవి. రతి, ఉత్సాహము, శోకము, విస్మయము, హాసము, భయము, జుగుప్స, క్రోధము-ఇవి నాట్యమందుఁ జెప్పఁబడినవి.

## రతిస్థాయిలక్షణం.

యూనోరన్యోన్యవిషయా స్థాయినీచ్ఛారతిర్భవేత్. 240
నిసర్గేణాభియోగేన సంసర్గేణాభిమానతః,
ఆత్మోపమాదివిషయై రేతాస్స్యుస్తత్ర విక్రియాః. 241
కటాక్షపాతభ్రూక్షేపప్రియవాగాదయోఽపి చ,

స్వభావము, సహవాసము, సంబంధము, అభిమానము, ఆత్మోపమాది విషయములు. వీనిచేత నాయికానాయకులమనసునగలుగు అన్యోన్యవిషయమైన ఇచ్ఛావిశేషము రతిస్థాయి యౌను. అందు కడగంటిచూపు, కనుబొమ లెగురవేయుట, ప్రియవాక్యము మొదలైనవి గలుగును.

అంకురపల్లవకలికా ప్రసూనఫలభావభాగియం క్రమశః.
ప్రేమామానః ప్రణయః స్నేహో రాగోఽనురాగ ఇతి,

వరుసగ మొలక, చిగురు, మొగ్గ, పుష్పము, ఫలముచు నగురతిస్థాయి భావము ప్రేమయని, మానమని, ప్రణయమని, స్నేహమని, రాగమని, అనురాగమని ఈపేళ్లను బొందుచున్నది.

## ప్రేమలక్షణం.

స ప్రేమా ప్రేమసహితం యూనోర్యద్భావబంధనం. 243

నాయికానాయకుల ప్రీతిసహితమైన మనస్సులకలయిక ప్రేమ యనఁబడును.

## మానలక్షణం.

యత్తు ప్రేమానుబంధేన స్వాతంత్ర్యాద్ధ్రదయంగమం,
బధ్నాతి భావకౌటిల్యం స మాన ఇతి గీయతే 244

నాయికానాయకులకు ప్రేమబంధముచేత స్వాతంత్ర్యమువలనఁగలుగు భావకౌటిల్యము మాన మనఁబడును.

## ప్రణయలక్షణం.

బాహ్యాంతరోపచారైర్యత్ప్రేమ మానోపకల్పితైః,
బధ్నాతి భావవిస్రంభం సోఽయం ప్రణయ ఉచ్యతే. 245

నాయికానాయకులమానోపకల్పితములైన బాహ్యాంతరోపచారముల చేత భావవిస్రంభమును గలుగఁజేయుప్రేమ ప్రణయ మనఁబడును.

## స్నేహలక్షణం.

విస్రంభే పరమాం కాష్ఠామారూఢే దర్శనాదిభిః,
యత్ర ద్రవత్యంతరంగం స స్నేహ ఇతి కథ్యతే. 246
స త్రేధా కథ్యతే ప్రౌఢమందమధ్యమభేదతః,

నాయికానాయకులవిస్రంభము చూపుమొదలయినవానిచేత పూర్ణము కాఁగా ఏదశయందు మనసుకఱగుచున్నదో యది స్నేహమనఁబడును. ఆస్నే

హము ప్రౌఢస్నేహమనియు, మందస్నేహమనియు, మధ్యస్నేహమనియు ముత్తెఱంగులఁ జెప్పఁబడినది.

## ప్రౌఢస్నేహలక్షణం.

ప్రభానాదిభిరజ్ఞాతచిత్తవృత్తౌ ప్రియే జనే. 247
ఇతరక్లేశ కారీ యః స ప్రౌఢస్నేహ ఉచ్యతే,

తోఁచుట మొదలయినవానిచేత నెఱుఁగఁబడని చిత్తవృత్తిగలనాయకుని యందు ఇతరక్లేశకారియైనస్నేహము ప్రౌఢస్నేహ మనఁబడును.

## మందస్నేహలక్షణం.

ద్వయోరన్యస్య మానాదౌ తదన్యస్య కరోతి యః. 248
నైవాపేక్షాం న చోపేక్షాం స స్నేహో మంద ఉచ్యతే,

నాయికానాయకులలో ఒకరికి కోపము మొదలయినవి కలిగియున్నప్పుడు రెండవవారికి ఉపేక్షాపేక్షలను జేయకయుండునది మందస్నేహ మనఁబడును.

## మధ్యస్నేహలక్షణం.

ఇతరానుభవాపేక్షామీక్షతే యస్స మధ్యమః. 249

ఇతరానుభవాపేక్షను నెదురుచూచుచున్నది మధ్యమస్నేహ మనఁబడును.

## రాగలక్షణం.

దుఃఖమప్యధికం చిత్తే సుఖత్వేనైవ రజ్యతే,
యేన స్నేహప్రకర్షేణ స రాగ ఇతి కథ్యతే. 250
కుసుంభనీలమాంజిష్ఠరాగభేదేన స త్రిధా,

ఏస్నేహాతిశయమువలన మనసున దుఃఖము సుఖమువలెనే తోఁచు చున్నదో యది రాగ మనఁబడును. ఆరాగము కుసుంభరాగమనియు, నీలరాగమనియు, మాంజిష్ఠరాగమనియు ముత్తెఱఁగులౌను.

## కుసుంభరాగలక్షణం.

కుసుంభరాగస్స జ్ఞేయో యశ్చిత్తే రజ్యతే క్షణాత్. 251
అతిప్రకాశమానోఽపి క్షణాదేవ వినశ్యతి,

ఏరాగము మనసున క్షణకాలముననే కలుగునదియును, అధికముగ ప్రకాశించుచున్నదైనను తత్క్షణమే మాఱునదియునో అది కుసుంభరాగ మనఁబడును.

## నీలరాగలక్షణం.

నీలరాగస్తు యస్సక్తో నాపైతి న చ దీప్యతే. 252

ఏది మనసున సక్తమై మాఱకుండను, ప్రకాశించకుండను నున్నదో యది నీలరాగ మనఁబడును.

## మాంజిష్ఠరాగలక్షణం.

అచిరేణైవ సంసక్తశ్చిరాదపి న నశ్యతి,
అతీవ భాసతే యోఽసౌ మాంజిష్ఠో రాగ ఉచ్యతే. 253

ఏది చిత్తమందు త్వరగ సంసక్తమై యెన్నటికినిమాఱక ప్రకాశించు చున్నదో యది మాంజిష్ఠరాగ మనఁబడును.

## అనురాగలక్షణం.

రాగ ఏవ స్వసంవేద్యదశాప్రాప్త్యా ప్రకాశితః,
యావదాశ్రయవృత్తిశ్చేదనురాగ ఇతీరితః. 254
అన్యే ప్రీతిం రతేశ్చేదమామనంతి మనీషిణః,

ముందుచెప్పినరాగమే తనసంవేద్యదశను పొందుటచేత ప్రకాశితమై ఆశ్రయముండువఱకుండెనేని యది అనురాగ మనఁబడును. కొందఱు ప్రీతిని రతిభేదమని చెప్పుదురు.

### ఉత్సాహస్థాయిలక్షణం.

శక్తిధైర్యసహాయాద్యైశ్శీలశ్లాఘ్యేషు కర్మసు. 255
సత్వరా మానసీవృత్తి రుత్సాహ స్తత్ర విక్రియాః,
కాలాద్యవేక్షణం ధైర్యత్యాగారంభాదయోఽపి చ. 256
సహజాహార్యభేదేన స ద్విధా పరికీర్తితః,

శీలశ్లాఘ్యములైనకార్యములయందు శక్తి, ధైర్యము, సహాయము మొదలయినవానిచేత త్వరగా ప్రవర్తించుమనోవ్యాపారము ఉత్సాహస్థాయి యగును. అందుసమయమును జూచుట, ధైర్యము, త్యాగము, ఆరంభము మొదలైనవిగలుగును.ఇది సహజోత్సాహస్థాయి యనియు, ఆహార్యోత్సాహస్థాయి యనియు నిరుదెఱఁగులగును.

### శోకస్థాయిలక్షణం.

బంధువ్యాపత్తిదౌర్గత్యధననాశాదిభిః కృతః 257
చిత్తక్లేశకరశ్శోక స్తత్ర చేష్టా వివర్ణతా,
బాష్పోద్గమో ముఖే శోష స్తంభనిశ్వసితాదయః. 258

బంధువిషయమైనవిపత్తు, దుర్గతి, ధననాశము మొదలైనవానిచేగలుగు చిత్తక్లేశకరమైనవృత్తి శోకస్థాయి యనఁబడును. అందు దేహకాంతిమాయుట, కన్నీరుకలుగుట, ముఖమువాఁడుట, స్తంభము, నిట్టూర్పు మొదలైనవి గలుగును.

### విస్మయస్థాయిలక్షణం.

లోకోత్తరపదార్థానామపూర్వాలోకనాదిభిః,
విస్తారశ్చేతసో యస్తు విస్మయస్స నిగద్యతే. 259

క్రియా స్తత్రాక్షివిస్తారో సాధూక్తిపులకాదయః,

లోకోత్తరమైనపదార్థములను అపూర్వముగఁజూచుట, వీనిచేఁగలుగు మనోవిస్తారము విస్మయస్థాయి యనఁబడును. ఇందు నేత్రవైశాల్యము, శ్లాఘించుట, పులకరింపు మొదలైనక్రియలు గలవు.

## హాసస్థాయిలక్షణం.

భాషణాకృతివేషాణాం క్రియాయాశ్చ వికారతః. 260
తౌల్యాదేవ పరస్థానా మేషామనుకృతేరపి,
వికారశ్చేతసో హాసస్తత్ర చేష్టాస్సమీరితాః. 261
దృష్టేర్వికాసో నాసోష్ఠకపోలస్పందనాదయః,

పలుకులు ఆకారము వేషము పని వీనివికారముచేతను, ఇవి పరస్థలవాసులవైనయెడ సహజముగానుండినను, వెక్కిరించుటచేతను, గలుగు మనోవికారము హాసస్థాయి యనఁబడును. ఇందు వికారపుచూపు, ముక్కు పెదవి చెక్కిళ్లు వీనికదలిక మొదలైనవి గలుగును.

## భయస్థాయిలక్షణం.

భయం తు మంతునా ఘోరదర్శనశ్రవణాదిభిః 262
చిత్తస్యాతీవ చాంచల్యం తత్ప్రాయో నీచమధ్యయోః,
ఉత్తమస్య తు జాయేత కరణైరతికారణైః. 263
అనుభావోऽత్ర భవేత్కంపముఖసంశోషణాదిభిః,

ఆకస్మికముగా భయంకరవస్తువులను జూచుట వినుట మొదలైనవాని చేతను, తప్పిదముచేతనుగలుగు మిక్కిలిచిత్తచాంచల్యము భయస్థాయి యనఁబడును. ఇది ఉత్తమ మధ్యమ నీచాశ్రయమై ముత్తెఱంగులౌను. దీనిని వణఁకుట, ముఖమువాడుట, మొదలైనవానిచే నెఱుఁగవచ్చును.

### జుగుప్సాస్థాయిలక్షణం.

అహృద్యానాం పదార్థానాం దర్శనశ్రవణాదిభిః. 264
మనస్సంకోచనం యత్సా జుగుప్సా తత్ర విక్రియాః,
నాసాపిధానం త్వరితా గతిరాస్యవికూణనం 265
సర్వాంగధూననం కుత్సా ముహుర్నిష్ఠీవనాదయః,

అయోగ్యవస్తువులను జూచుట వినుట మొదలైనవానిచేఁగలుగు మనస్సంకోచము జుగుప్సాస్థాయి యనఁబడును. ముక్కుమూసికొనుట, వేగముగఁబోవుట, ముఖమును వంకరచేసికొనుట, సర్వాంగధూననము, అసహ్యపడుట, మాటిమాటికి ఉమ్మివేయుట మొదలైనవి గలుగును.

### క్రోధస్థాయిలక్షణం.

భవేత్ప్రజ్వలనం క్రోధః పురాక్షేపాదిసంభవః. 266
ఫుల్లనాసాపుటోద్వృత్త తారకాద్యనుభావయుక్,
శత్రుభృత్యసుహృత్పూజ్యాశ్చత్వారో విషయా మతాః.

పురాక్షేపాదులచేఁగలుగు మనఃప్రజ్వలనము క్రోధస్థాయి యనఁబడును. ఇది ఫుల్లనాసాపుటము, గిరగిరతిరుగునల్లగ్రుడ్లు, మొదలైన అనుభావములను గలదై యుండును. దీనికి శత్రువులు, భృత్యులు, స్నేహితులు, పూజ్యులు, ఈ నలుగురు విషయము లనఁబడుదురు.

### శత్రువిషయక్రోధో యథా.

ముహుర్దష్టోష్ఠతా భంగో భ్రుకుట్యా దంతఘట్టనం,
హస్తనిష్పీడనం గాత్రప్రకంపోఽస్త్రస్య వీక్షణం. 268
స్వభుజావేక్షణం కంఠగర్జాద్యాశ్శాత్రవక్రుధి,

శత్రువిషయక్రోధమందు అడుగడుగునకు పెదవులుకొఱుకుకొనుట, కనుబొమలువంకరయవుట, పండ్లుకొఱుకుట, చేతులను పిసుకుకొనుట, దేహముఁవణఁ-

కుట, అస్త్రమునుజూచుట, తనభుజములను జూచుకొనుట, గర్జించుట మొదలైనవి గలుగును.

### భృత్యవిషయక్రోధో యథా.

భృత్యక్రోధే తు చేష్టాస్స్యుర్నేత్రాంతపతదశ్రుతా. 269
తూష్ణీం ధ్యానం చ నైశ్చల్యం శ్వసితాని ముహుర్ముహుః,
మౌనం వినమ్రముఖతా భుగ్నదృష్ట్యాదయో మతాః 270

భృత్యక్రోధమందు కన్నీరుకారుట, ఊరక ధ్యానించుట, కదలకయుండుట, అడుగడుగునకు నిట్టూర్పులుపడుచుట, మాటలాడకయుండుట, తలవంచుకొనుట, భుగ్నదృష్టి మొదలైనవి గలుగును.

### మిత్రక్రోధో యథా.

మిత్రక్రోధే తు చేష్టాస్స్యుః భావగర్భవిభూషణం,
భ్రూభేదనిటలస్వేదకటాక్షారుణిమాదయః. 271

మిత్రక్రోధమందు భావగర్భముగ భూషించుట, కనుబొమ్మలు భేదపడుట, నొసటఁజెమటకలుగుట, కన్నులుఎఱ్ఱనౌట మొదలయినవి గలుగును.

### పూజ్యక్రోధో యథా.

పూజ్యక్రోధే తు చేష్టాస్స్యుస్స్వనిందా నమ్రవక్త్రతా,
అనుత్తరప్రదానాంగస్వేదగద్గదతాదయః. 272

పూజ్యక్రోధమందు తన్నుతాను నిందించుకొనుట, తలవంచుకొనుట, ప్రత్యుత్తరము చెప్పకుండుట, దేహమున చెమట గలుగుట, కంఠగద్గదము మొదలైనవి గలుగును.

భృత్యాదికోపత్రితయే తత్తత్కోపోదితాః క్రియాః,
మిథః స్త్రీపుంసయోరేవ రోషః స్త్రీగోచరః పునః. 273

ప్రత్యయావధిరత్ర స్యుః వికారాః కుటిలేక్షణం,
అధరస్ఫురణాపాంగరాగనిశ్వసితాదయః. 274

భృత్యాదిక్రోధత్రితయమందును దానిదానికిఁ జెప్పఁబడిన క్రియలు దాని దానికిఁ గలుగును. మిత్రక్రోధాంతర్గతమైన స్త్రీపురుషులకోపములయందు స్త్రీమీఁదిపురుషకోపము ప్రత్యయముగలుగునంతవఱకు నుండును. ఇందు వంకరచూపు, పెదవు లదరుట, కడకన్ను లెఱ్ఱనౌట, నిశ్వాసములు మొదలైనవి గలుగును.

ద్వేధా నిగదితస్త్రీణాం రోషః పురుషగోచరః,
సపత్నీరోషహేతుస్స్యాదన్యస్స్యాదన్యహేతుకః. 275
సపత్నీహేతుకో రోషః విప్రలంభే ప్రపంచ్యతే,
అన్యహేతుకృతే త్వత్ర క్రియాః పురుషరోషవత్. 276

పురుషవిషయమైన స్త్రీకోపము సపత్నీహేతుకమనియు, అన్యహేతుకమనియుం, ఇరుదెఱఁగు లౌను. సపత్నీహేతుకమైనరోషము విప్రలంభమందుఁ జెప్పఁబడుచున్నది. అన్యహేతుకృతరోషమందు పురుషరోషమందుఁ గల క్రియలు గలుగును.

ఏతే చ స్థాయినస్సర్వే విభావైర్వ్యభిచారిభిః,
సాత్వికైరనుభావైశ్చ నటాభినయగోచరాః 277
సాక్షాత్కారమివానీతాః ప్రాపితా స్స్వాదురూపతాం,
సామాజికానాం మనసీ ప్రయాంతి రసరూపతాం. 278

విభావవ్యభిచారిభావసాత్వికానుభావవ్యాపారయాపానుభావములచే సాక్షాత్కారమును బొందింపఁబడినట్లు అభినయగోచరములై స్థాయిభావములు స్వాదురూపతను బొందింపఁబడి సామాజికులమనసున రసతాయును బొందుచున్నవి.

దధ్యాదివ్యంజనైశ్చించామరిచ్యాదిభిరౌషధైః,
గుడాదిమధురద్రవ్యైర్యథాయోగ్యం సమన్వితైః. 279
యథాపాకవిభేదైశ్చ నిష్పాద్యో రస ఓదనః,
నిష్పాద్యతే విభావాద్యైః ప్రయోగేణ తథా రసః. 280
సోఽయమానందసంభేదో భావజ్ఞైరనుభూయతే,

యథాయోగ్యముగఁ గూడిన పెరుగు మొదలైనవ్యంజనములచేతను, చింతపండు మిర్యాలు మొదలయిన యౌషధములచేతను, బెల్లము మొదలయిన మధురపదార్థములచేతను, పాకభేదములచేతను, అన్నమునకు రసమెట్లుకలుగుచున్నదో అట్లు విభావాదిభావములచేతను, ప్రయోగముచేతను, రసము నిష్పన్నమగుచున్నది. రసమనునది మనస్సుచే నెఱుఁగఁదగిన సుఖవిశేషము. అది భావజ్ఞులచే ఆస్వాదింపఁబడుచున్నది.

## రసభేదానాహ.

శృంగారవీరకరుణాద్భుతహాస్యభయానకాః. 281
భీభత్సశ్చ తథా రౌద్రో నాట్యే త్వష్టరసాః స్మృతాః,

శృంగారము, వీరము, కరుణము, అద్భుతము, హాస్యము, భయానకము, భీభత్సము, రౌద్రము - అని నాట్యమందు ఎనిమిదిరసములు చెప్పఁబడుచున్నవి.

## శృంగారరసలక్షణం

రసేషు తత్ర శృంగారః ప్రథమం వక్ష్యతే స్ఫుటం. 282
విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః,
నీతా సదస్యరస్యత్వం రతిశ్శృంగార ఉచ్యతే. 283
నాయికా నాయకో వాపి తత్ర చాలంబనం మిథః,
రూపయౌవనలావణ్యకులశీలాదితద్గుణైః. 284

వాగ్భిశ్చ మధురాలాపగీతకర్మకలాదిభిః,
చేష్టాభిర్భుజవిక్షేపకటాక్షహసితాదిభిః. 285

అలంకారైస్స్రగాలేపదుకూలకటకాదిభిః,
తటస్థైశ్చంద్రదీపాద్యైః భావైరుద్దీపితా తతః. 286

కాంతదృష్టిప్రసన్నాస్యరాగాద్యైరాంగికైరపి,
వాచికైర్మధురాలాపగుణసంకీర్తనాదిభిః. 287

సాత్త్వికస్తంభకంపాద్యైరనుభావైః ప్రకాశితా,
ఔత్సుక్యచింతాహర్షాద్యైస్సంపుష్టా సహకారిభిః. 288

యా రతిస్థాయినీ సైవ భావాద్యైరభిరంజితా,
రస్యమానా సహృదయైర్యాతి శృంగారతామియం 289

క్రిందఁజెప్పిన యెనిమిదిరసములలో మొదట శృంగారరసము చెప్పఁబడుచున్నది. విభావానుభావవ్యభిచారిసాత్త్వికభావములచే సదస్యాస్వాద్యత్వమును బొందినరతిస్థాయిభావము శృంగారరస మని చెప్పఁబడును. ఆరతిస్థాయి నాయికానాయకులను ఆలంబనము గలది. రూపము యౌవనము లావణ్యము కులము శీలము మొదలయిననాయికానాయకులగుణములచేతను, మధురమైన పలుకులచేతను, సంగీతవిద్య మొదలయినవానిచేతను, భుజవిన్యాసము కటాక్షము హాసము మొదలయినవానిచేతను, చేష్టలచేతను, పుష్పము గంధము వస్త్రము హస్తాభరణము మొదలయినఅలంకారములచేతను, చంద్రదీపాదులయినతటస్థభావములచేతను, మరల నుద్దీపితయై చక్కనిచూపు ప్రసన్నముఖరాగము మొదలయిన ఆంగికములచేతను, మధురాలాపము గుణకీర్తనము మొదలయిన వాచికములచేతను, స్తంభకంపాదులయినసాత్త్వికానుభావములచేతను, ప్రకాశితమై ఔత్సుక్యము చింత హర్షము మొదలయినసహకారులచేతను, పోషింపఁబడిన ఆరతియే భావములచే రంజితయై రసికులచే ఆస్వాద్యమానయై శృంగారసమాటను పొందుచున్నది.

తం విభజతే.

విప్రలంభశ్చ సంభోగ ఇతి స ద్వివిధా భవేత్,

ఆశృంగారరసము విప్రలంభశృంగారమని, సంభోగశృంగారమని రెండు విధము లౌను.

విప్రలంభం లక్షయతి.

అప్రాప్తిర్విప్రలంభస్స్యాద్యూనోర్జాతాభిలాషయోః. 290
పాండిమగ్లానిదృష్ట్యాద్యా అనుభావా ఇహ స్మృతాః,
హర్షగర్వజుగుప్సోగ్ర్యమదహాసశమైర్వినా. 291
అన్యే సంచారిణస్సర్వే భవంత్యత్ర యథోచితం,

అత్యంతాసక్తిగల నాయికానాయకులకు పరస్పరము చేరికలేకయుండుట విప్రలంభ మనఁబడును. ఇందు విరహపాండిమము, సోలినచూపు మొదలయినవిగలుగును. హర్షము, గర్వము, జుగుప్స, ఉగ్రభావము, మదము, హాసము, శమము ఇవివినా కడమసంచారిభావములన్నియుచు ప్రకృతానుగుణముగ గలుగును.

విప్రలంభం విభజతే.

అయోగో విరహో మానః ప్రవాసశ్శాప ఇత్యపి. 292
విప్రలంభస్య పంచైతే హేతవః పరికీర్తితాః,

అయోగము, విరహము, మానము, ప్రవాసము, శాపము అని విప్రలంభమునకు అయిదుహేతువులు గలవు.

అయోగవిప్రలంభశృంగారలక్షణం.

ప్రాగసంగతయోర్యూనోరనురాగేఽపి జాగ్రతి. 293
అయోగః పారతంత్ర్యాద్యైర్విప్రలంభోఽభిలాషజః,
ప్రవేశనిర్గమౌ తూష్ణీం తద్దృష్టిపథగామితా. 294

రాగప్రకాశనపరా శ్చేష్టాస్స్వాత్మప్రకాశనం,
వ్యాజోక్తయశ్చ విజనే స్థితిరిత్యాదయోఽపి చ. 295
తత్ర సంచారిణో గ్లానిశ్శంకాసూయా భ్రమో భయం,
నిర్వేదౌత్సుక్యదైన్యాని చింతానిద్రే ప్రబుద్ధతా. 296
విషాదజడతోన్మాదా మోహో మరణమేవ చ,
తత్తత్సంచారిభావానాముచితాపి దశా భవేత్. 297
క్రమేణ ప్రాక్తనై రస్య దశావస్థాస్సమాసతః,
ప్రోక్తాస్తదనుసారేణ భరతేన మహాత్మనా. 298

అతిప్రేమగల నాయికానాయకులకు ప్రథమసమాగమమునకు మునుపు గలవిప్రలంభము అయోగవిప్రలంభ మనఁబడును. ఇందు నాయకునిఁజూచి యింటిలోపలికిఁబోవుట, బయటవచ్చుట, ఓరక అతనిచూపున కగపడుట, తనఆసను బయలుపఱచుచేష్టలు, తనదేహమును ప్రకాశపఱచుట, వ్యాజోక్తులు, విజనస్థలమందుండుట మొదలయినవిగలవు. గ్లానియుం, శంకయుం, అసూయయు, భ్రమము, భయము, నిర్వేదము, ఔత్సుక్యము, దైన్యము, చింత, నిద్ర, ప్రబోధము, విషాదము, జాడ్యము, ఉన్మాదము, మోహము, మరణము–ఈవ్యభిచారిభావములకు యథోచితముగ ప్రవేశముగలదు. ఈ యయోగవిప్రలంభమునకు దశావస్థలుగలవని ప్రాచీనులమతము ననుసరించి భరతుని చేతను జెప్పఁబడినవి.

## దశావస్థా నిరూపయతి.

చక్షుః ప్రీతిశ్చింతా సంకల్పో గుణనుతిః క్రియాద్వేషః,
తాపో లజ్జాత్యాగోన్మాదౌ మూర్ఛా మృతిర్దశావస్థాః. 299

చక్షుఃప్రీతి, చింత, సంకల్పము, గుణనుతి, క్రియాద్వేషము, తాపము, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి అనునవి పదియవస్థలు.

## చక్షుఃప్రీతిలక్షణం ౧-టివి.

చక్షుఃప్రీతిః స్పృహా రమ్యే దృష్టే వాలంబనే శ్రుతే,
కౌతుకస్వేదరోమాంచహర్షవిస్మయసాధ్వసైః. 300
చాపలస్తంభలజ్జాద్యైరనుభావ్యో భవేదయం,

రమ్యమైన ఆలంబనము వినఁబడినదిగాని చూడఁబడినదిగాని కాఁగా, దానియందుఁగలిగిన ఇచ్ఛ చక్షుఃప్రీతి యనఁబడును. ఇది సంతోషము, స్వేదము, పులకరింపు, హర్షము, ఆశ్చర్యము, సాధ్వసము, చాపలము, స్తంభము, సిగ్గు మొదలయినవానిచేత భావింపఁదగినది.

## చింతాలక్షణం. ౨-వది.

కేనోపాయేన సంసిద్ధ్యేత్కదా తేన సమాగమః. 301
దూతీముఖేన కిం వాచ్యమిత్యాద్యూహో విచింతనం,
అత్రానుభావా నిశ్వాసధ్యానస్రస్తాంగతాదయః. 302
వలయాదిపరామర్శస్వేదాంబుపులకాదయః,
శయ్యాసనాదివిద్వేష ఇత్యాద్యాః స్మరకల్పితాః. 303
నిర్లక్ష్యవీక్షణం చైవమాద్యాస్స్యుర్విక్రియా మతాః,

కోరిక యేయుపాయముచేత ఈడేరును? అతనితోడ నెప్పుడు కూడిక కలుగును? చెలులతో నేమిచెప్పి పంపవచ్చును? అని ఊహించుట చింత యనఁబడును. ఇందు నిట్టూర్పు, ధ్యానము, దేహముసోలుట, హస్తాభరణాదులను చేతితో తడవుట, చెమట, పులకరింపు, శయ్యాసనాదులయందు విద్వేషము, నిర్లక్ష్యవీక్షణము మొదలైనవి గలుగును.

## సంకల్పావస్థాలక్షణం. ౩-వది.

మనోరథస్స్యాత్సంకల్పస్తత్సమాగమగోచరః. 304
ఔత్సుక్యస్వేదరోమాంచస్మృతిశ్వాసాక్షిమీలనైః,
బాహ్యార్థస్యాపరిజ్ఞానేనానుభావ్యో భవేదసౌ. 305

నాయకసమాగమగోచరమైన మనోరథము సంకల్ప మనఁబడును. ఈయవస్థయందు ఔత్సుక్యము, స్వేదము, రోమాంచము, స్మరణము, శ్వాసము, కన్నులుమూసికొనుట, బాహ్యవ్యాపారముఁ దెలియకయుండుట, మొదలైనవి గలుగును.

గుణనుతిలక్షణం. ౪-వది.

భవేద్గుణనుతి స్తస్య రూపాదిపరికీర్తనం. 306
రోమాంచో గద్గదా వాణీ భావావరణవీక్షణం,
తత్సంగచింతనం సఖ్యా గండస్వేదాదయోఽపి చ. 307
ఔత్సుక్యహర్షస్మృత్యాద్యా అనుభావా ఇహ స్మృతాః,

నాయకుని రూపము మొదలైనగుణములను బొగడుట గుణనుతి యనఁబడును. ఇందు రోమాంచము, డగ్గుత్తుకగలపలుకులు, సాభిప్రాయముగఁజూచుట, చెలికత్తెలతో నతనిసంగమమునుగుఱించి యోచించుట, కపోలములయందు చెమట, ఉత్సాహము, హర్షము, స్మరించుట మొదలైనవి గలుగును.

క్రియాద్వేషలక్షణం. ౫-వది.

క్రియాద్వేష స్తతోఽన్యత్ర విద్వేషో భోజ్యవస్తుని. 308
చింతానిశ్వాసదైన్యాశ్రు కళాజాగరపాండుతాః,
విషాదో గ్లానిరిత్యాద్యా అనుభావా స్తదుద్భవాః. 309

నాయకునితప్ప ఇతరములైన భోజ్యవస్తువులయందు గలుగుద్వేషము క్రియాద్వేష మనఁబడును. ఇందు చింత, నిశ్వాసము, దైన్యము, కన్నీరు విడుచుట, నిదురలేకయుండుట, వెలవెలపోవుట, విషాదము, సోలుట మొదలైనవి గలుగును.

తాపలక్షణం. ౬-వది.

తత్ప్రాప్తేర్విప్రకర్షేణ తాపస్స్యాత్కామజో జ్వరః,
వైవర్ణ్యమశ్రు వైస్వర్యం శయనే పరివర్తనం. 310

నిశ్వాసముఖశోషాద్యా అనుభావా స్తదుద్భవాః,

ప్రియునిరాకయొక్క విలంబమునఁ గలుగుకామజ్వరము తాప మనఁ బడును. ఇందు వైవర్ణ్యము, కన్నీరు, స్వరభంగము, పడకలో పొరలుట, నిట్టూర్పు, ముఖమువాడుట మొదలైనవి గలుగును.

## లజ్జాత్యాగలక్షణం. ౭-వది.

లజ్జాత్యాగస్త్రపాహానిరౌత్సుక్యాదిసముద్భవా. 311
ఉల్లంఘనం భవేద్వాచాం గౌరవాగణనం తథా,
విషాదో వ్యగ్రతా దైన్యమిత్యాద్యైరనుభావ్యతే. 312

ఔత్సుక్యము మొదలైనవానిచేత సిగ్గునుమానుట లజ్జాత్యాగ మనఁ బడును. ఇందు ఆజ్ఞనుమీఱుట, గౌరవమును దలఁపకుండుట, విషాదము, వ్యగ్రత, దైన్యము మొదలైనవి గలుగును.

## ఉన్మాదలక్షణం. ౮-వది.

సర్వావస్థాసు సర్వత్ర తన్మనస్కతయా సదా,
అతస్మిం స్తదితి భ్రాంతిరున్మాదో విరహోద్భవః. 313
తత్ర చేష్టాస్తు విజ్ఞేయా ద్వేషస్స్వేష్టేఽపి వస్తుని,
దీర్ఘో ముహుశ్చ నిశ్వాసో నిర్నిమేషతయా స్థితిః. 314
అనిమిత్తస్మితధ్యానగానమౌనాదయోఽపి చ,
అకాండగమనోత్థానశంకాద్యా అపి విక్రియాః. 315
విషాదమదరోషాద్యా అనుభావా ఇహ స్మృతాః,

ఎప్పుడును సర్వావస్థలయందును నాయకునియందు దత్తచిత్తురాలై యుండుటచేత ఒకవస్తువు మఱియొకవస్తువుగాఁ దోఁచుట విరహమువలనఁ గలిగిన ఉన్మాద మనఁబడును. ఇందు తనయిష్టవస్తువునందుఁగూడ ద్వేషము, నిట్టూర్పు, ఱెప్పపాటులేమి, హేతువులేకనవ్వుట, ధ్యానించుట, పాడుట, మూర్ఛపో

వుట, నిమిత్తములేకనడచుట, లేచుట, శంకమొదలైనవి, విషాదము, మదము, రోషము ఈయనుభావములు గలుగును.

## మూర్ఛాలక్షణం. ౯-వది.

తాపోత్కర్షాత్తదప్రాప్త్యా మూర్ఛాజ్ఞానక్షయో ముహుః.
ఇదమిష్టమనిష్టం తదితి వేత్తి న కించన,
నోత్తరం భాషతే ప్రశ్నే నేక్షతే న శృణోతి చ. 317
క్రమేణ మందావుచ్ఛ్వాసనిశ్వాసౌ నష్టచేష్టతా,
స్పర్శానభిజ్ఞతేత్యాద్యా భవంత్యత్రానుభావకాః. 318

నాయకుఁడురానందున అధికతాపముచేత జ్ఞానముక్షయించుట మూర్ఛ యనఁబడును. ఇందు ఇష్టమును అనిష్టమును దెలియకుండుట, పిలిచినను పలుక కుండుట, చూపులేకుండుట, చెవివినకుండుట, క్రమముగా నుచ్ఛ్వాసనిశ్వాసములు మందములగుట, చేష్టలులేకయుండుట, అంటినఁ దెలియకుండుట ఇవి మొదలైన యనుభావములు గలుగును.

## మృతిలక్షణం. ౧౦-వది.

స్మరోత్థా మరణేచ్ఛా చేన్మృతిరిత్యభిధీయతే,
లీలాశుకవినోదాదిన్యాసస్స్నిగ్ధసఖీకరే. 319
కలకంఠకలాలాపశ్రుతర్మందానిలాశ్రయః,
జ్యోత్స్నాప్రవేశమాకందమంజరీప్రేక్షణాదయః. 320
ఉద్బంధనాదిసన్నాహాస్సాస్రదృష్ట్యాదయస్త్విహా,

మన్మథవ్యాపారముచేఁ గలుగుమరణేచ్ఛ మృతి యనఁబడును. ఇందు విలాసపుచిలుకతోడియాట మొదలయినవానిని సఖులకు ఒప్పగించుట, కోవెలల ముద్దుపలుకులనువినుట, మందమారుతమునుఆశ్రయించుట, వెన్నెలలోనికిఁ బోవుట, మామిడిపూఁగొత్తులనుజూచుట, ఉరిమొదలైనవానిని సిద్ధపఱుచుకొనుట, కన్నీటితోడిచూపు మొదలయినవి గలుగును.

### విరహవిప్రలంభలక్షణం.

కాలక్షేపస్తు సంప్రాప్తేః కార్యాద్వా పారతంత్ర్యతః. 321
ఏకగ్రామస్థయోర్యూనోర్విరహస్సోఽభిధీయతే,
ఔత్సుక్యచింతానిశ్వాసవితర్కాద్యనుభావభాక్. 322

ఒకేయూరిలోనుండెడి నాయికానాయకులకు ప్రీతిసిద్ధమైయుండఁగ కార్యవశమువలనగాని పరాధీనతవలనగాని కలియుటకు కాలహరణము కలిగెనా అది విరహవిప్రలంభశృంగార మనఁబడును. ఇందు ఉత్సాహము, చింత, నిట్టూర్పు, వితర్కము మొదలయినవి గలుగును.

### మానవిప్రలంభలక్షణం.

ఈక్షణాలింగనాదీనాం నిరోధో మాన ఉచ్యతే,
ప్రణయేర్ష్యాప్రభేదేన ద్వివిధస్సోఽభిధీయతే. 323

చూచుట ఆలింగనము మొదలైనవ్యాపారములను నిరోధించియుండుట మాన మనఁబడును. ఆమానము ప్రణయమానమనియు, ఈర్ష్యామానమనియు ఇరుదెఱఁగు లౌను.

### ప్రణయమానలక్షణం. ౧-టిది.

తత్ర ప్రణయమానస్స్యాదాజ్ఞాలంఘనతో మిథః,
అభాషణం చ వైముఖ్యమిత్యాద్యైరనుభావ్యతే. 324

వానిలో నాయికానాయకులకు పరస్పరము ఆజ్ఞాలంఘనము చేఁగలుగునది ప్రణయమానమౌను. ఇందు మాటలాడకయుండుట, ముఖముత్రిప్పుకొని యుండుట మొదలైనవి కలుగును.

### ఈర్ష్యామానలక్షణం.

ఈర్ష్యామానస్తు యః కోపః ప్రియే జ్ఞాతాన్యసంగమే,
అభాషణముపాలంభో భర్త్సనం తాడనం తథా. 325

వైముఖ్యమశ్రుచామర్ష ఇత్యాద్యైరనుభావ్యతే,
తద్జ్ఞానం శ్రవణాద్దృష్టి రనుమానాచ్చ వా భవేత్. 326

అన్యస్త్రీసంభోగము నెఱుఁగుటచే ప్రియునియందుఁ గలుగుకోపము ఈర్ష్యామాన మనఁబడును. ఇది అభాషణము, ఉపాలంభము, బెదిరించుట, కొట్టుట, వైముఖ్యము, కన్నీరు, ఓర్వమి, ఇవి మొదలైనవానిచే నెఱుఁగఁదగినది. దీని నెఱుఁగుట-వినికి, చూచుట, అనుమానము (ఊహించుట) ఈ మూఁటిలో దేనివలననైన నగును.

శ్రవణాదిని నిరూపయతి.

శ్రవణం దూతికాదిభ్యో దృష్టిస్స్వేక్షాద్యైలోకనమ్,
అనుమానం స్వప్నగోత్ర స్ఖలనాదిభిరుచ్యతే. 327

శ్రవణమనునది దూతిక మొదలయినవారివలనవినుట, దృష్టియనునది ఎదురుగఁజూచుట, అనుమానమనునది స్వప్నమందు పేరుమార్చి పిలుచుట మొదలయినవానిచేతఁ గలుగునని చెప్పఁబడుచున్నది.

ప్రవాసవిప్రలంభలక్షణం.

దేశాంతరస్థితిర్యా తు ప్రవాసస్సోఽభిధీయతే,
కార్శ్యపాండిమనిశ్వాసచింతాదైన్యాశ్రుగద్గదాః. 328
లంబాలకత్వమిత్యాద్యా అనుభావాస్సమీరితాః,

నాయికానాయకుల దేశాంతరస్థితి ప్రవాసవిప్రలంభ మనఁబడును. ఇందు చిక్కిపోవుట, తెల్లనౌట, నిట్టూర్పు, చింత, దైన్యము, కన్నీరు, లంబాలకత్వము మొదలయిన యనుభావములు గలుగును.

శాపవిప్రలంభలక్షణం.

శాపస్తు జాడ్యజాచ్ఛాపాత్ సుదూరే వాథ సన్నిధౌ. 329
చింతాసంతాపనిశ్వాస పాండిమాద్యనుభావభాక్,

అయోగవిప్రలంభోక్తా దశావస్థా యథోచితం. 330
అన్యేషు విప్రలంభేషు భవేయు రితి కీర్తితాః,

దూరములోనుండిన సమీపములోనుండిన జాడ్యముచేఁ గలుగుకోపము శాపవిప్రలంభ మనఁబడును. ఇందు చింత, సంతాపము, నిశ్వాసము, పాండిమము మొదలయిన అనుభావములుగలుగును. అయోగవిప్రలంభమందుఁ జెప్పఁబడిన దశావస్థలు శదితరవిప్రలంభములయందును యథోచితముగఁ గలుగునని చెప్పఁబడియున్నది.

## సంభోగశృంగారలక్షణం.

అనుకూలౌ నిషేవేతే యత్రాన్యోన్యం విలాసినౌ. 331
దర్శనస్పర్శనాదీని స సంభోగ ఉదాహృతః,
స్మితభ్రూలలితా దృష్టిః లలితం మధురం వచః. 332
స్తంభాద్యాస్సాత్వికాస్సర్వే చేష్టా లీలాదయోఽపి చ,
ప్రసన్నముఖరాగశ్చ ఇత్యాద్యా అనుభావకాః. 333
జుగుప్సాశమనిర్వేద వ్యాధ్యున్మాదా మదో మృతిః,
విషాదోఽమర్ష ఆలస్యమపస్మారోఽత్ర వర్జితాః. 334
ద్వివిధస్స తు సంతుష్ట స్సంపన్న శ్చేతి కథ్యతే,
యువానౌ యత్ర సంతుష్టౌ సాత్వికవ్రీడితాదిభిః. 335
ఉపచారాన్నిషేవేతే స సంతుష్ట ఇతీరితః,
ప్రోషితాగతయోర్యూనో ర్భోగస్సంపన్న ఈరితః. 336

పరస్పరానుకూల్యము విలాసముంగలవారై నాయికానాయకులు దర్శనస్పర్శనాదులనుబొందునది సంభోగశృంగార మనఁబడును. అందు వికసించినకనుబొమలచేత నందమయినచూపు, లలితమధురమైనపలుకు, స్తంభాదిసాత్వికభావములన్నియు లీలాదిచేష్టలు ప్రసన్నమైనముఖకాంతియు మొదలైనవి దీనికి అనుభావములు. జుగుప్స, శమము, నిర్వేదము, వ్యాధి,

ఉన్మాదము, మదము, మృతి, విషాదము, అమర్షము, ఆలస్యము, అపస్మారము వీనినివర్జించి తదితరసంచారిభావములుగలుగును. ఈసంభోగశృంగారము సంక్షిప్తమనియు,సంపన్నమనియు ఇరుదెఱఁగులౌను.యౌవనవంతులైన స్త్రీపురుషులు సాత్వికోదయము సిగ్గుమొదలగువానిచేత సంక్షిప్తములయిన యుపచారములను పొందినది సంక్షిప్త మనఁబడును. ఎడఁబాసియుండి కూడినవారిసంభోగము సంపన్న మనఁబడును.

### వీరరసలక్షణం.

విభావైరనుభావైశ్చ సాత్వికైర్వ్యభిచారిభిః,
నీతస్సదస్యరస్యత్వ ముత్సాహో వీర ఉచ్యతే. 337
యదాలంబనత స్తత్త ద్గుణదానాదిదీపితః,
ప్రసన్నముఖరాగాద్యైరనుభావ్యో భవేదయం 338
ఔత్సుక్యచింతాహర్షాద్యైః పోష్యతే సహకారిభిః,
యుద్ధవీరో దయావీరో దానవీరశ్చ స త్రిధా. 339

విభావానుభావసాత్వికవ్యభిచారిభావములచే సదస్యరస్యత్వమును పొందింపఁబడినదై ఆలంబనగుణదానాదులచే ఉద్దీపితమైన ఉత్సాహస్థాయి వీరరసమాచున్నది. అది ప్రసన్నమైనముఖకాంతిమొదలయినవానిచే భావింపఁదగినది. ఔత్సుక్యము, చింత, హర్షము మొదలయినసహకారులచే పోషింపఁబడును. ఆవీరరసము యుద్ధవీర, దయావీర, దానవీర రసములని మూఁడెఱఁగులౌను.

### యుద్ధవీరరసలక్షణం.

సహాయాన్వేషణం యుద్ధే సమరోచితపాటవం,
భీతాభయప్రదానాద్యా అనుభావాః ప్రకీర్తితాః. 340
యుద్ధవీరేహర్షగర్వా మర్షాద్యావ్యభిచారిణః,

యుద్ధవీరరసమందు యుద్ధమున సహాయమును వెతకుట, యుద్ధమున నుచితమైనపటుత్వము, భయపడినవారలకు అభయమిచ్చుట మొదలయిన అనుభావములును, హర్షము, గర్వము, అమర్షము మొదలయిన వ్యభిచారిభావములును గలవు.

## దయావీరరసలక్షణం.

స్వార్థప్రాణవ్యయేనాపి ప్రపన్నత్రాణశీలతా. 341
ఆశ్వాసనోక్తయస్థైర్యమిత్యాద్యా విక్రియా మతాః,
దయావీరే మతిధృతిప్రముఖావ్యభిచారిణః. 342

దయావీరరసమందు తనఅర్థము ప్రాణము పోఁగొట్టుకొనినైనను తన్ను శరణుచొచ్చినవారలను రక్షించెడిస్వభావము, ఊఱటపలుకులు, స్థిరత్వము ఇవిమొదలయిన యనుభావములును, మతి ధృతి మొదలైన వ్యభిచారిభావములును గలవు.

## దానవీరరసలక్షణం.

స్మితపూర్వాభిభాషిత్వం స్మితపూర్వం చ వీక్షణం,
ప్రసాదాద్బహుదాతృత్వం తద్వాచామనుమోదనం. 343
గుణాగుణవిచారాద్యా అనుభావాస్సమీరితాః,
దానవీరే ధృతిర్హర్ష ఇత్యాద్యా వ్యభిచారిణః. 344

దానవీరరసమందు మందస్మితపూర్వకమైనపలుకు, స్మితపూర్వకమయిన చూపు, దయచేసివిశేషముగఇచ్చుట, వారిపలుకులను అనుమోదించుట, గుణాగుణవిచారము మొదలైనఅనుభావములును, ధృతియు హర్షము ఇవిమొదలైనవ్యభిచారిభావములును గలవు.

## కరుణరసలక్షణం.

విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః,
సదస్యాస్వాద్యతాం నీతః శోకః కరుణ ఈరితః. 345

ధర్మనాశోఽర్థనాశశ్చ బాంధవేష్టజనక్షయః,
వధోద్బంధౌ చ దారిద్ర్యం పదభ్రంశః పరాజయః 346
దైవోపహతిధిక్కారౌ వ్యాధిశ్శాపోపశంసనం,
ఇత్యాద్యాలంబనం దృష్టమనుభూతం శ్రుతం చ వా. 347
యస్య చోద్దీపనం జ్ఞేయం ఆలంబనగుణాశ్రయం,
కేశవాసోఽంగసంస్కార వైధుర్యం స్రస్తగాత్రతా. 348
రక్తాభో ముఖరాగశ్చ సబాష్పా మంధరా చ దృక్,
భూపాతో ముఖవైవర్ణ్యం బాహూపాతో వికత్థనం. 349
విన్యాసో హస్తయోర్మూర్ధ్ని నిశ్వాసోచ్ఛ్వాసదీర్ఘతా,
ఉరశ్శిరోముఖస్యాపి తాడనం లుంఠనం భువి. 350
హాహాకారస్తథాక్రందో విలాపః పరిదేవనం,
భావాస్తంభాదయస్సర్వే భవేయురనుభావకాః. 351
నిర్వేదో దైన్యమాలస్యం ఉన్మాదవ్యాధిసుప్తయః,
నిద్రా మోహశ్శ్రమో గ్లానిశ్చింతా స్మృతిరపస్మృతిః. 352
విషాదో జాడ్యమౌత్సుక్యం శంకా మరణమేవ చ,
ఏతే సంచారిణః ప్రోక్తాః కరుణే మునిసమ్మతాః. 353
ఉత్తమాధమమధ్యేషు యథాయోగం భవంత్యమీ,

విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములచే సదస్యులకు అనుభవార్హత్వమును పొందింపఁబడినశోకస్థాయి కరుణరస మనఁబడును. ఇందు ధర్మనాశము, అర్థనాశము, ఇష్టజనబాంధవజనక్షయము, వధము, తూఁగువేయుంట (ఉరిదీయుట) దారిద్ర్యము, పదభ్రంశము, అవమానము, దైవోపహతి, ధిక్కారము, వ్యాధియు, శాపమునుచెప్పుట ఇవి మొదలయినవి చూడఁబడినను అనుభవింపఁబడినను వినఁబడినను ఆలంబనవిభావములగును. ఉద్దీపనవిభావములును వాని నాశ్రయించియుండును. వెండ్రుకలు వస్త్రము దేహము ఇవి వికారమునుబొందుట, దేహము సోలియుండుట, ఎఱ్ఱని ముఖకాంతి, కన్నీరు

గలచూపు ఈఉద్దీపనములు, నేలబడుట, ముఖవైవర్ణ్యము, చేతులువ్రేల వేయుట, అవికత్థనము, చేతులనుతలపైపెట్టుకొనుట, నిట్టూర్పులిడుట, ఱొమ్ము తల ముఖము వీనినికొట్టుకొనుట, నేలమీఁదపొరలుట, హాహాకారము, రోదనము విలాపము పరిదేవనము ఈఅనుభావములును, స్తంభప్రళయాది సాత్త్విక భావములును, నిర్వేదము దైన్యము ఆలస్యము ఉన్మాదము వ్యాధి సుప్తి నిద్ర మోహము శ్రమము గ్లాని చింత స్మృతి అపస్మారము విషాదము జాడ్యము ఔత్సుక్యము శంక మరణము ఈవ్యభిచారిభావములును గలవు. ఈభావములు ఉత్తమమధ్యమాధమవిషయములయందు యథోచితముగ గలుగును.

## అద్భుతరసలక్షణం.

విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః. 354
ప్రాప్తస్సదస్యాస్వాద్యత్వం విస్మయోఽద్భుతతాం వ్రజేత్,
దుష్ప్రాప్యవస్తునః ప్రాప్తిః కర్మ చాప్యతిమానుషం. 355
మరీచిమానగంధర్వ నగరాద్యవలోకనం,
మాయేంద్రజాలనృత్తాది యస్య చాలంబనం మతం. 356
ప్రసన్నముఖరాగోఽక్షి విస్తారో నిర్నిమేషతా,
శిరఃకపోలచలనం సాత్త్వికాశ్చానుభావకాః 357
వితర్కచాపలావేగ హర్షాద్యా వ్యభిచారిణః,

విభావానుభావసాత్త్వికభావవ్యభిచారిభావములచే సభవారికి ఆస్వాద్యత్వమును బొందియుండు విస్మయస్థాయి అద్భుతరసమగును. ఈఅద్భుతరసమునకు దుష్ప్రాప్యమైనవస్తువులప్రాప్తి, మనుష్యులకు అశక్యమైనపనులను జేయుట, కాంతిచే నిర్ణయింపఁదగిన గంధర్వనగరాదులఁజూచుట, మాయ ఇంద్రజాలవిద్య నృత్యము మొదలయినవి ఆలంబనములు. అందు ప్రసన్నమైనముఖరాగము, నేత్రవిస్తారము, ఱెప్పపాటులేకయుండుట, తల కపోల ప్రదేశము వీనినికదలించుట ఈఅనుభావములును, స్తంభాదిసాత్త్వికానుభావ

ములును, వితర్కము చాపలము ఆవేగము హర్షము మొదలయినవ్యభిచారి భావములును గలవు.

## హాస్యరసలక్షణం.

విభావై రనుభావైశ్చ సాత్త్వికై ర్వ్యభిచారిభిః. 358
నీతస్సదస్య రస్యత్వం హాసో హాస్య ఇతీరితః,
అసౌ విదూషకో వేత్తి మత్తాద్యాలంబనాశ్రయః. 359
మల్లయుద్ధాహతకర్మ నిర్లజ్జత్వాదితద్గుణైః,
మృగపక్షిమనుష్యాణాం స్వరానుకరణై స్తథా. 360
వేదశాస్త్రకలావిద్యాదేశభాషాదికస్య చ,
విడంబనై రసంబద్ధాసత్ప్రలాపైశ్చ దూషణైః. 361
పరక్రియానుకరణవాగాద్యైరపి చేష్టితైః,
తటస్థై స్తత్సహాచారై స్సమ్యగుద్దీపిత స్తతః. 362
ఓష్ఠనాసాకపోలాస్యస్పందనై ర్దంతనిర్గమైః,
అనుమోదసముద్భూతై స్సాధుసాధ్వితిభాషితైః. 363
స్తంభప్రళయవర్జైశ్చ సాత్త్వికై రనుభావితః,
ఔత్సుక్యచాపలవ్రీడాహర్షస్మృతిమదశ్రమైః. 364
మతిగర్వావబోధైశ్చ విస్మయేన చ సమ్మితః,
సోఽయం స్మితాదిభేదేన షడ్విధః పరికథ్యతే. 365

విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావములచే సదస్యాస్వాద్యత్వమును బొందింపఁబడినహాసస్థాయి హాస్యరస మనఁబడును. ఈరసము వికటకవులు ఉన్మత్తులు మదించినవారు మొదలయినవారలను ఆశ్రయించినదై మల్లయుద్ధము ఆహతముచేయుట సిగ్గుమానుట మొదలయినవానిగుణములచేతను, మృగపక్షి మనుష్యులస్వరములయొక్క అనుకరణములచేతను, వేదములు శాస్త్రములు కలలు విద్యలు దేశభాషలు మొదలగువాని యనుకరణములచేతను,

సందర్భములేనిమాటలచేతను, సత్ప్రలాపములచేతను, దూషణములచేతను, పరక్రియలననుకరించు పలుకులచేతను, చేష్టలచేతను, దానిననుసరించిన తటస్థోద్దీపనములచేతను, బాగుగ ఉద్దీపితమై పెదవులు ముక్కు చెక్కిళ్లు ముఖము వీనిని కదలించుటచేతను, దంతముల వెలిబుచ్చుటచేతను, సంతోషము చేగలిగిన లెస్సలెస్స అనుపలుకులచేతను, స్తంభప్రళయములను వర్జించి రోమాంచాది సాత్వికానుభావములచేతను భావింపఁబడినదై ఔత్సుక్యము, చాపలము, వ్రీడ, హర్షము, స్మృతి, మదము, శ్రమము, మతి, గర్వము, అవబోధము, విస్మయము వీనిచేతపోషింపఁబడినదై ఆహాస్యరసము స్మితాదిభేదములచే నాఱువిధము లౌనని చెప్పఁబడుచున్నది.

## స్మితాదీని నిరూపయతి.

స్మితమథ హసితం విహసితముపహసితం చాపహసితం చ,
అతిహసితం ద్వౌభేదౌ స్తాముత్తమమధ్యమాధమ ప్రకృతౌ.

స్మితము, హాసితము, విహాసితము, ఉపహాసితము, అపహాసితము, అతిహాసితము ఈఆఱున్ను ఉత్తమమధ్యమాధమప్రకృతులయందు ఒక్కొకనికి రెండురెండువంతున గలుగును.

## స్మితలక్షణం. ౧.

ఈషద్వికసితైర్గండైః కటాక్షస్సష్టసంస్మితైః,
అలక్షితద్విజాళీకం స్మితమిత్యభిధీయతే. 367

కడకంటిచూపులచే వ్యక్తమైననవ్వులతోను కొంచెము వికాసమును బొందినచెక్కిళ్లతోనుగూడి తెలియఁబడని దంతములుగలదిగానుండునవ్వు ఉత్తములకు గలుగును. ఇది స్మిత మనఁబడును.

## హసితలక్షణం. ౨.

ఉత్ఫుల్లానననేత్రం తు గండైర్వికసితైస్తథా,
కించిల్లక్షితదంతం చ హసితం తద్విధీయతే. 368

వికసితమైనగండప్రదేశములతోఁగూడి వికాసమునుబొందిన ముఖ నేత్రములుగలదిగాను కొంచెము చూడఁదగినదంతములు కలదిగాను నుండునది హాసిత మనఁబడును.

## విహాసితలక్షణం. 3.

ఆకుంచితాక్షిగండం యత్సస్వరం మధురం తథా,
కాలాగతం సాస్యరాగం తద్వై విహాసితం భవేత్. 369

వంచఁబడినచూపును చెక్కిళ్లనుగలదిగాను, మధురముగాను, తగుసమయమందు వచ్చినదిగాను, ముఖవిలాసముతోఁ గూడినదిగాను ఉండునవ్వు విహాసిత మనఁబడును.

## ఉపహాసితలక్షణం. ౪.

ఉత్ఫుల్లనాసికం యత్తు జిహ్వోదృష్టినిరీక్షణం,
ఆకుంచితాంసకశిరః తచ్చోపహాసితం భవేత్. 370

వికసించినముక్కుగలిగినదై నాలుకయందు కంటిచూపుగలదై వంచఁబడిన భుజము శిరస్సునుగలదిగానున్ననవ్వు ఉపహాసిత మనఁబడును.

## అపహాసితలక్షణం. ౫.

సస్వానమపహాసితం యత్తు సాశ్రునేత్రం తథైవ చ,
నిష్కంపితాంసకశిర స్తచ్చాపహాసితం భవేత్. 371

ధ్వనిగలిగి కన్నులనీళ్లతోఁగూడి భుజశిరస్సులు తలద్రమును గదలకనవ్వెడునవ్వు అపహాసిత మనఁబడును.

## అతిహాసితలక్షణం. ౬.

సస్వరం సాశ్రునేత్రం చ వికృష్టస్వనముద్ధతం,
కరోపగూఢపార్శ్వం యత్తచ్చాతిహాసితం భవేత్. 372

స్వరముతోఁ గూడినదిగాను, నేత్రమందు కన్నీరుగలదిగాను, అధికధ్వని గలదిగాను, గొప్పదిగాను, ప్రక్కలు పిసికికొనునదిగాను నుండునప్పు అతి హాసిత మనఁబడును.

### భయానకరసలక్షణం.

విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః,
నీతస్సదస్యరస్యత్వం భయమేవ భయానకః. 373
రక్షఃపిశాచభల్లూకవ్యాఘ్రవ్యాళాదిదర్శనం,
శూన్యారణ్యగృహారామశ్మశానాదిప్రవేశనం. 374
యుద్ధదస్యునృపద్రోహవికృతోగ్రస్వనా అపి,
అస్యాలంబనముద్దీప్త్యై భవేయుస్స్వేద ఏవ చ. 375
ముఖోష్ఠతాలుకంఠస్యశోషః పార్శ్వావలోకనం,
శ్యామాభో ముఖరాగశ్చ నిష్క్రాంతభ్రాంతతారకాః. 376
ప్రణామః కాందిశీకత్వమంగుళిత్రాణచర్వణం,
సహాయాన్వేషణాది స్యాదాంగికైర్వాచికైస్తథా. 377
శరణం భవ మే యుష్మద్దాసోఽహం రక్ష రక్ష మాం,
అభయం దేహి మే తాతేత్యాదిరప్యస్య సాత్త్వికాః. 378
సర్వేఽనుభావకా యస్య త్రాసావేగౌ శ్రమో మృతిః,
విషాదశ్చాపలం మోహశ్చింతాజాడ్యమపస్మృతిః. 379
ఏతే సంచారిణః ప్రోక్తా భరతాగమవేదిభిః,

విభావానుభావవ్యభిచారిసాత్త్వికభావములచే సదస్యరస్యత్వమును బొందింపఁబడినదై యుండుభయస్థాయి భయానకరస మౌను. ఈరసమునకు రాక్షసుఁడు, దయ్యము, భల్లూకము, వ్యాఘ్రము, పాము మొదలైనవానిని జూచుట; శూన్యమైన అడవి, ఇల్లు, తోట, శ్మశానము మొదలయినవానియందు ప్రవేశించుట; జగడము, దొంగ, రాజద్రోహము, వికారముగను ఉగ్రముగను ఉండుస్వరము. మొదలయినవి ఆలంబనములౌను. దీనికి చెమటయుద్దీపనము ముఖము

పెదవులు చెక్కిళ్లు వీనికంపము, ముఖమువాడుట, ప్రక్కలనుజూచుట, ముఖమునల్లనౌట,నల్లగుడ్లుతిరుగుట,ఒక్కప్రక్కకుపోవుట, దండము పెట్టుట, పారిపోవుట, వ్రేళ్లకవచముచకఅచుకొనుట, ఆంగికములచే వాచికములచే సహాయమును వెతకుట మొదలయినవి; నీకునేదాసుఁడను నిన్నుశరణుపొందినాను నన్ను కాపాడుము కాపాడుము, అభయమియ్యవలయును అనుట; ఇవి మొదలయిన అనుభావములును; అన్నిసాత్వికభావములును, త్రాసము, ఆవేగము, శ్రమము, మృతి, విషాదము, చాపలము, మోహము, చింతయు, జాడ్యము, అపస్మారము, ఈసంచారిభావములును గలవు.

## బీభత్సరసలక్షణం.

విభావాద్యైస్స్వదస్యానాం ప్రాపితో రస్యతామసౌ. 380
జుగుప్సాస్థాయికస్తజ్జ్ఞైర్బీభత్స ఇతి కథ్యతే,
రక్తమాంసవసాస్థ్యాదిచ్ఛర్దిలాలాద్యపాశ్రయః. 381
అనుభావైః పరావృత్తి ముఖదృక్కూణనాదిభిః,
శ్యామేన ముఖరాగేణ సాత్వికైః పుళకాదిభిః. 382
నిర్వేదశంకాపస్మారవిషాదజడతాదిభిః,
దీనతామోహశోకైశ్చ సహితో వ్యభిచారిభిః. 383
స పునర్ద్వివిధక్షోభీ చోద్వేగీతి చ కథ్యతే,
రక్తమాంసాదిభిః క్షోభీ ఛర్దిలాలాదిభిః పరః. 384

విభావము మొదలైనభావములచే సభవారికి ఆస్వాద్యత్వమును బొందింపఁబడినదియు జుగుప్సాస్థాయియునైనది బీభత్సరసమనఁబడును. ఈబీభత్స రసము రక్తము, మాంసము, పులినీరు, ఎముకలు మొదలయినవియు, వాంతి, జొల్లు మొదలయినవియు, ఆశ్రయముగాఁగలది. వెనుకకుతిరుగుట. ముఖము దృష్టియు వంకబోవుట మొదలయినవి, నల్లనిముఖముకాంతి, ఈఅనుభావములతోను, పులకము మొదలయినసాత్వికానుభావములతోను, నిర్వేదము, శంక, అపస్మారము, విషాదము, జాడ్యము, దైన్యము, మోహము, శోకము మొద

లైన వ్యభిచారిభావములతోను గూడియుండును. ఇది క్షోభిబీభత్సమనియు, ఉద్వేగిబీభత్సమనియు ఇరుదెఱఁగులౌను. రక్తమాంసాదులచేఁగలుగునది క్షోభిబీభత్సము. ఛర్దిలాలాదులచేఁగలుగునది ఉద్వేగిబీభత్సము.

## రౌద్రరసలక్షణం.

విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః,
నీతస్సదస్యాస్వాద్యత్వం క్రోధో రౌద్ర ఇతీరితః. 385
ఆతతాయీ చ పిశునః పాతకాద్యభియోజకః,
క్షేపావమానాద్యాక్రోశవధబంధాదిఘాతకృత్. 386
యో వాన్యో ద్రోహకారీ చ తస్యాలంబనమిష్యతే,
దార్ఢ్యనిర్భయతాగర్వైరౌద్ధత్యాదియుతైర్గుణైః. 387
కో భవాన్కింకరోషి త్వమిత్యాద్యాః పరుషోక్తయః,
ద్వేషవాక్చ శిరఃకంపహాసవక్రేక్షణాదయః. 388
దష్టోష్ఠతా చ భృకుటీ రక్తోద్వృత్తా చ తారకా,
భూతాడనభుజాస్ఫాలచపేటాముష్టితాడనం. 389
కపోలస్ఫురణం రక్తముఖరాగో వధోద్యమః,
ఖేదనాకర్షణాఘాతఛేదనం పటమోచనం. 390
భాషణం దండశస్త్రాస్త్రగ్రహణం చాభిధావనం,
మారణాశ్రువికర్షాస్పృక్పానాన్యత్యభిధావనం. 391
ఆః పాప నృపశో ద్రోహిన్ తిష్ఠతిష్ఠ క్వ ధావసి,
ఉత్పాటయామి మూర్ధానం కుర్వే వక్షోవిదారణం. 392
ఉన్మూలయామి రదనాన్గాత్రం సంచూర్ణయామి చ,
ఇత్యాదివాచికం చైవ భయవర్జమసాత్త్వికం. 393
యస్యానుభావతాం యాంతి యస్యామర్షో మదస్మృతిః,
ఔత్సుక్యావేగమోహాశ్చ గర్వేర్ష్యాచాపలోగ్రతాః. 394
ఉన్మాదోత్సాహబోధాశ్చ భవేయుర్వ్యభిచారిణః,

విభావానుభావసాత్వికవ్యభిచారిభావములచే సదస్యాస్వాద్యత్వమును బొందింపఁబడినక్రోధస్థాయి రౌద్రరసమని చెప్పఁబడును. ఆతతాయియు, కొండెముచెప్పువాఁడు, పాపము మొదలయినవానిని జేయుమనువాఁడు, క్షేపము అవమానము మొదలయిన ఆక్రోశమును బంధనము వధము మొదలయిన హింసను జేయువాఁడు, ద్రోహముఁ జేయువాఁడును దీనికి ఆలంబనములు. దార్ఢ్యము, భయములేకయుండుట, గర్వము, ఔద్ధత్యము, మొదలైనగుణములును, ఎవఁడురానీవు ఏమిచేయుచున్నావురా అనునవి మొదలయిన క్రూరవాక్యములును, విరోధపుపలుకులు, తలయూచుట, నవ్వుట, వంకరగఁజూచుట మొదలైనవియు, పెదవికొఱుకుట, కనుబొమలముడివేయుట, గ్రుడ్లుఎఱ్ఱనై గిరగిర తిరుగుట, నేలకొట్టుట, భుజాస్ఫాలనముచేయుట, చేయితట్టుట, గుద్దులిడుట, చెక్కిళ్లుఅదరుట, ఎఱ్ఱనిముఖకాంతి, చంపెడుయత్నము, భేదించుట, ఈడ్చుట కొట్టుట, నఱుకుట, వస్త్రమునువదలించుట, మాటలాడుట, దండశస్త్రాదులనుగ్రహించుట, పరుగులిడుట, చంపుట, కన్నీరిడుట, నెత్తురుత్రాగుట, మిక్కిలితఱముట, ఓరిపాపీ, మనుష్యపశువా, ద్రోహీ, నిలువునిలువు ఎచటికిఁబోయెదవు, నీతలపగులఁగొట్టెదను, బొమ్మచీల్చెదను, దంతములురాలఁగొట్టెదను, దేహమునలియఁగొట్టెదను, ఇవిమొదలైనపలుకులును, భయములేకయుండుట, సాత్వికములేకయుండుట, అనుభావములౌను. అమర్షము, మదము, స్మృతి, ఔత్సుక్యావేగములు, మోహము, గర్వము, ఈర్ష్య, చాపలము, ఉగ్రత ఈసంచారిభావములును గలవు.

## రసాద్రసోత్పత్తిర్యథా.

హాస్యో భవతి శృంగారాత్కరుణో రౌద్రకర్మణః. 395
అద్భుతశ్చ తథావీరాద్బీభత్సాచ్చ భయానకః.

శృంగారరసమువలన హాస్యరసము గలుగుచున్నది. రౌద్రరసమువలన కరుణరసము గలుగుచున్నది. వీరరసమువలన అద్భుతరసము గలుగుచున్నది. బీభత్సమువలన భయానకరసము కలుగుచున్నది.

—— రసానాం విరోధో యథా. ——

ఉభౌ శృంగారబీభత్సౌ మిథో వీరభయానకౌ. 396
రౌద్రాద్భుతౌ తథా హాస్యకరుణౌ ప్రకృతిద్విషౌ,

శృంగారరసమును బీభత్సరసమును పరస్పరవిరోధులు. వీరరసమును భయానకరసమును విరోధులు. రౌద్రరసమును అద్భుతరసమును విరోధులు. హాస్యరసమును కరుణరసమును విరోధులు.

రసాః కార్యవశాత్సర్వే మిళంత్యేవ పరస్పరం. 397
ప్రథమం యో రసః ఖ్యాతః స ప్రధానో భవిష్యతి,

అన్ని రసములును కార్యవశమువలనఁ జేరుచున్నవి. వానిలో మొదట యేరసము చెప్పఁబడుచున్నదో అది ప్రధానరస మనఁబడును.

ముఖ్యే రసేఽపి తేఽంగత్వం ప్రాప్నువంతి కదాచన. 398

రసములలో ముఖ్యమైనరసమందు తదితరరసములు ఒకానొకసమయమందు అంగత్వమును బొందుచున్నవి.

సంచారిణాం రసానామప్యానుకూల్యమిహోచ్యతే,

ఆ రసములకును 33 వ్యభిచారిభావములకును పరస్పరానుకూల్యము చెప్పఁబడుచున్నది.

—— ౧-శృంగారవ్యభిచారిణామానుకూల్యం. ——

సర్వే భావాః ప్రయోక్తవ్యాశ్శృంగారే వ్యభిచారిణః.

శృంగారరసమందు 33 వ్యభిచారిభావములును ప్రయోగింపఁదగును.

—— ౨-వీరవ్యభిచారిణామానుకూల్యం. ——

అమర్షశ్చ విబోధశ్చ వితర్కోఽథ మతిర్ధృతిః,
క్రోధోఽసూయాథ సంమోహా ఆవేగశ్చాపి హర్షణం. 400
గర్వో మదస్తథోగ్రత్వం భావా వీరే భవంత్యమీ,

వీరరసమందు ఆమర్షము, విబోధము, వితర్కము, మతి, ధృతి, క్రోధము, అసూయ, సంమోహము, ఆవేగము, హర్షము, గర్వము, మదము, ఉగ్రత్వము ఇవి గలుగును.

3-కరుణవ్యభిచారిణామానుకూల్యం.

దైన్యం చింతా తథా గ్లానిర్నిర్వేదో జడతా స్మృతిః. 401
వ్యాధిశ్చ కరుణే ప్రోక్తా భావా భావవిశారదైః,

కరుణరసమందు దైన్యము, చింత, గ్లాని, నిర్వేదము, జాడ్యము, స్మృతి, వ్యాధి ఈవ్యభిచారిభావములు గలుగును.

4-అద్భుతవ్యభిచారిణామానుకూల్యం.

ఆవేగో జడతా మోహో హర్షణం విస్మయః స్మృతిః. 402
ఇతి భావాః ప్రయోక్తవ్యా రసజ్ఞైరద్భుతే రసే,

ఆవేగము, జాడ్యము, మోహము, హర్షము, విస్మయము, స్మృతి, ఈభావములు అద్భుతరసమందుఁ గలుగును.

5-హాస్యవ్యభిచారిణామానుకూల్యం.

శ్రమశ్చపలతా నిద్రా స్వప్నో గ్లానిస్తథైవ చ. 403
శంకాసూయావహిత్థా చ హాస్యే భావా భవంత్యమీ,

శ్రమము, చాపలము, నిద్ర, స్వప్నము, గ్లాని శంక, అసూయ, అవహిత్థ, ఈవ్యభిచారిభావములు హాస్యరసమందుఁ గలుగును.

6-భయానకవ్యభిచారిణామానుకూల్యం.

సంత్రాసో మరణం దైన్యం గ్లానిశ్చైవ భయానకే. 404

సంత్రాసము, మరణము, దైన్యము, గ్లాని, ఇవి భయానకరసమందుఁ గలుగును.

౭-బీభత్సవ్యభిచారిణామానుకూల్యం.

అపస్మారో విషాదశ్చ భయం రోగో మృతిర్మదః,
ఉత్సాహశ్చేతి విజ్ఞేయా బీభత్సే వ్యభిచారిణః. 405

అపస్మారము, విషాదము, భయము, రోగము, మృతి, మదము, ఉత్సాహము ఈవ్యభిచారిభావములు బీభత్సరసమందుఁ గలుగును.

౮-రౌద్రవ్యభిచారిణామానుకూల్యం.

హర్షోఽసూయా తథా గర్వ ఉత్సాహో మద ఏవ చ,
చాపల్యముగ్రతా చేతి రౌద్రే భావాః ప్రకీర్తితాః. 406

హర్షము, అసూయ, గర్వము, ఉత్సాహము, మదము, చాపల్యము, ఉగ్రత ఈభావములు రౌద్రరసమందుఁ గలుగును.

రామాదేర్వ్యాదికారణోపజనితః కార్యైః ప్రతీతిం గతః
సంపుష్టస్సహకారిభిర్జనయతి స్థాయీ సుఖం వాసుఖం,
భావానామనువర్ణనానుకరణైః కావ్యేఽపి నాట్యేఽపి చ,
వ్యక్తోఽయం తు నిరాశ్రయస్సుఖకరస్సభ్యైరసశ్చర్వ్యతే.

ఇతి భరతరసప్రకరణం సంపూర్ణం.

ఆలంబనభూతనాయికానాయకులమనసున కారణముచేఁగలిగినదై, కార్యములయిన అనుభావములచే జ్ఞానవిషయమునుబొంది, సహకారులవ్యభిచారిభావములచే పోషింపఁబడి సాక్షియై, సంభోగశృంగారమునందు సుఖమును, విప్రలంభశృంగారమందు దుఃఖమును గలుఁగజేసి, భావముల అనువర్ణనానుకరణములచే కావ్యమందును, నాట్యమందును, వ్యక్తమై నిరాశ్రయమై సుఖకరమైనరసము రసికులచే నాస్వాదింపఁబడుచున్నది.

ఇట్లు భరతరసప్రకరణము ముగిసినది.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి.
"వావిళ్ల" ప్రెస్సున ముద్రితము:—1932.